Photo by Madangopal



మతి
న వ్యాఖ్య

అయితేగియితే అమ్మాయి ఎవరు ?

పంపినవారు :
పి. జయశ్రీ - తెనాలి

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | |
|---|---|---|---|
| దొంగకు తోడ్పడిన కొత్వాలు | 3 | లబ్ధప్రణాశం (గేయకథ) | 45 |
| కంచుకోట - 8 | ... 9 | అహింసాజ్యోతి - 2 | ... 49 |
| మూడు పరీక్షలు - 2 | ... 17 | ధర్మం గెలిచింది | ... 57 |
| రత్న నిపుణుడు | ... 25 | ప్రకృతి వింతలు | ... 65 |
| అనుమాన పిశాచం | ... 33 | తమాషాలు | ... 70 |


ఇవి గాక కార్టూను, ఫోటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.



# ఇది నిక్కము...

...పగిలిన పాత్ర, నీటిని మంచి
పాత్ర ఉంచినట్లు నిలవుంచదు,
శిరోజ రంగుతో నలుపుచేయబడిన
శిరోజముల నలుపు లోమాతో
చేయబడినట్లుగా నిలవుండదు,

శిరోజరంగు శిరోజరములను
పైపైని మాత్రమే నలుపుచేయును,
లోమా శిరోజములను సహజంగా నలుపుచేయును.




జగత్ప్రసిద్ధమైన [illegible]
కలను సహజంగా నలుపు
చేయునట్టిది.

[illegible] ఎమ్, ఎమ్. అంబర్‌వాలా అహమదాబాద్ 1

ఏజంట్లు:

## సి. నరోత్తమ్ అండ్ కో.,
బొంబాయి - 2.

★

## ఢిల్లీ మెడికల్ స్టోర్సు, ఢిల్లీ.

★

## షాహ బవిషి అండ్ కో.,
రాధాబజార్ స్ట్రీట్, కలకత్తా.

★

## జె. బలాభాయ్ అండ్ కో.,
నేతాజీ సుభాష్ రోడ్, మద్రాసు.




నూరు జంతువుల ఆటబొమ్మలు. మన్నిక గల ప్లాస్టిక్‌తో తయారైనవి. ఒక్కొక్కటి సుమారు 2 అంగుళాల మట్టుపైన అమర్చబడియుండును. ప్రదర్శనకు, వర్తకానికి, వినోదమైనది. షో-కేసులకు అద్భుతం.

### ఉత్సాహ సంగ్రహ పేటిక

ఒక్కొక్క అడుగులో ఉండే లాకర్లు:

4 ఏనుగులు, 4 జిరాఫిలు, 8 గాండామృగాలు, 4 గాడిదలు, 4 నక్కలు, 8 గుంటనక్కలు, 4 గుఱ్ఱములు, 4 సింహాలు, 8 పెద్దపులులు, 8 కంగారూలు, 4 లేళ్లు, 4 కారెనుములు, 4 ఆవులు, 8 కోళ్లు, 8 షాహమృగాలు, 4 కోతులు. వెల రు. 8/-
ప్యాకింగ్, పోస్టేజి రు. 1-50 న.పై.
వీ. పీ పీ. గా. పంపబడును.
వేరు కేటలాగ్ లేదు.

## ఓమా గిఫ్టు హవుస్

తపాలుపెట్టె నం. 4118, బొంబాయి - 7.



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ సంచిక అచ్చు అవుతున్న సమయంలో ఒక మహత్తరమైన సంఘటన జరిగింది. అదేమిటంటే సోవియెట్ శాస్త్రవేత్తలూ, సాంకేతిక నిపుణులూ కలిసి సూర్యుడిచుట్టూ ఒక కృత్రిమ గ్రహాన్ని ఏర్పాటుచేయటం.

కిందటి ఏడు కృత్రిమ చందమామలను భూమిచుట్టూ తిరిగేలాగు ఏర్పాటుచెయ్యటమే మానవుడికొక మహత్తర విజయమనిపించింది.

ఇప్పుడు మానవుడు ఏర్పాటుచేసిన కృత్రిమ గ్రహం భూమికి 37 లక్షల మైళ్లదూరంలో ఉండి, సూర్యుడిచుట్టూ తిరుగుతున్నది. ఇది భూమి నుంచి చంద్రుడికన్న దాదాపు 16 రెట్లు దూరం వెళ్ళి అక్కడ తన పరిధిని ఏర్పాటుచేసుకుని తిరుగుతున్నది. సోవియెట్ శాస్త్రజ్ఞులు చేసిన ఈ ప్రయోగంతో మానవ చరిత్రలో ఒక కొత్త అధ్యాయం ప్రారంభమవుతున్నది.

సంపుటి 24 : ఫిబ్రవరి 1959 : సంచిక 2



# అట్టవీూదిబొమ్మ

కృష్ణుడు హస్తినాపురం నుంచి ఉపప్లావ్యానికి తిరిగి వచ్చి పాండవసభలో తన రాయబారం విఫలమైనట్టు చెప్పి, "అప్పుడే కౌరవులు తమ పదకొండు అక్షౌహిణుల సేనలతో కురుక్షేత్రానికి వెళ్ళారు. భీష్ముణ్ణి వారు తమ సర్వసేనానిగా పెట్టుకున్నారు. కనుక మీరుకూడా వెంటనే కర్తవ్యం నిర్ణయించండి!" అన్నాడు.

ధర్మరాజు సభలోని వారితో, "మనకు ఏడు అక్షౌహిణీల సేనవున్నది. ఆ ఏడు అక్షౌహిణీలకూ ఏడుగురు యోధులు—విరాటుడు, ద్రుపదుడు, ధృష్టద్యుమ్నుడు, శిఖండి, సాత్యకి, చేకితానుడు, భీముడు—సేనానాయకులుగా వుంటే బాగుంటుందని నా అభిప్రాయం. సర్వసేనానిగా వుండటానికి ఎవరు తగుదురో నిర్ణయించండి!" అన్నాడు.

అర్జునుడు ధృష్టద్యుమ్నుణ్ణి సర్వసేనానిగా వుంచితే బాగుంటుందనీ, అతను అస్త్రవిద్యలోనూ, యుద్ధనైపుణ్యంలోనూ భీష్ముడితో అన్నివిధాలా తుల తూగగలవాడనీ అన్నాడు.

అర్జునుడి అభిప్రాయాన్ని కృష్ణుడుకూడా బలపరిచినమీదట రాజులందరూ ఈ నిర్ణయానికి తమహర్షాన్ని వెలిబుచ్చారు.

వెంటనే సమరసన్నాహం ప్రారంభమయింది. సైనికులు సంరంభంచేసి ఆయుధాలు మొదలైనవన్నీ తీసుకున్నారు. పాండవసేనకూడా కురుక్షేత్రానికి బయలుదేరింది. సేనకు ముందుగా భీముడూ, నకుల సహదేవులూ, అభిమన్యుడూ, ఉపపాండవులూ, ధృష్టద్యుమ్నుడూ మొదలైనవారు కదిలారు. సేన మధ్యలో ధర్మరాజున్నాడు.

ఈ సేన కురుక్షేత్రం చేరగానే సైనికశిబిరాలకు యోగ్యమైన చోటు చూశారు. హిరణ్వతీ నదీతీరాన మంచి రేవులున్నచోట, శుచి అయిన సమ ప్రదేశంలో శిబిరాలు నిర్మించ నిశ్చయించారు. కృష్ణుడు శిబిరాలచుట్టూ పెద్ద అగడ్త తవ్వించి దానికి సైనికులను కాపలా వుంచాడు. రాజులందరికీ ఒకేవిధమైన గుడారాలు వేశారు. సైనికులూ, శస్త్ర చికిత్సకులూ, ఇతర నౌకరులూ ఎవరి పనులలో వారు నిమగ్నులయారు. సైన్యానికి అవసరమైన కవచాలూ, ఆయుధాలూ, ఆహారసామగ్రీ కొండలంతేసి రాసులుగా అమర్చారు. ధర్మరాజు ప్రతి గుడారానికీ వెళ్ళి అన్ని ఏర్పాట్లూ స్వయంగా పరీక్షించాడు.



# దొంగకు తోడ్పడిన కొత్వాలు

ఒకప్పుడు కైరోనగరంలో ముయీన్ అల్దీన్ అనే గజదొంగ ఉండేవాడు. కైరో సుల్తాను ఎంత ప్రయత్నించికూడా అతన్ని పట్టలేక చివరకు కొత్వాలుగా నియమించాడు. నగరంలోని దొంగలు అతనికి వెరిచి కుక్కిన పేలల్లే అయిపోయారు.

ఒకనాడు ముయీన్ వలీగారి ఇంటి ముందు ఆవరణలో పడుకుని చిన్న కునుకు తీస్తూండగా ఒక బరువైన మూట వచ్చి అతనిపైన పడింది. ముయీన్ నిద్రలేచి చుట్టూ చూస్తే ఎవరూ కనిపించలేదు. అతనిపైన పడిన మూటలో వెయ్యి బంగారు దీనారాలున్నాయి! "నాపై ఇంత అభిమానం ఎవరికి కలిగిందో!" అనుకుంటూ అతను ఆ దీనారాలను తన జేబులో పెట్టుకున్నాడు.

మర్నాడు మళ్లీ అదే ప్రదేశంలో అతను నిద్రపోతూండగా ఇంకొక మూట బలంగా వచ్చి తలపై పడింది. అందులోకూడా వెయ్యి దీనారాలున్నాయి. దాన్ని పడవేసిన మనిషి జాడమాత్రం లేదు.

మూడో రోజు అతను నిజంగా నిద్రపోక, నిద్రపోతున్నట్టు అభినయించాడు. కొంచెం సేపటికల్లా ఎవరో తన జేబు తడువుతున్నట్టు అనిపించి అతను కళ్లు తెరిచి ఆ మనిషి చేతిని పట్టుకున్నాడు. మరుక్షణం అతనికి చెప్పరాని ఆశ్చర్యం కలిగింది. ఎందుచేతనంటే అతనికి చిక్కినది ఒక ఆడ మనిషి. ఆమె చిన్న వయసులో ఉండటమే గాక, చాలా అపూర్వమైన సౌందర్యవతిగా కూడా కనిపించింది.

మాట్లాడవద్దనీ, తనవెంట రమ్మనీ ఆమె సైగ చేసింది. ముయీన్ ఆమె వెంటనే బయలుదేరి వెళ్లాడు. ఇద్దరూ ఒక నిర్జనమైన సందులోకి వెళ్లాక అతను ఆమెతో, "నాతో నీకేం పని? నన్ను పెళ్లాడగోరితే నేను సిద్ధంగానే ఉన్నాను!" అన్నాడు.

బి. నాగరాజారావు





"అందుకు నేనేం చెయ్యగలను?" అన్నాడు కొత్వాలు ముయీన్.

"శ్రద్ధగా విను. ఇవాళ అర్ధరాత్రి నేను కాజీ ఇంటి సమీపంలో ఒంటరిగా కూచుని ఉంటాను. నువ్వు గస్తీ తిరుగుతూ అటు వచ్చి నన్ను ప్రశ్నించు. నేను నగరంలోకి పనిమీద వచ్చి నగరద్వారం మూసేలోగా తిరిగి ఇంటికి వెళ్లలేకపోయానని చెబుతాను. నువ్వు కాజీ ఇంటి తలుపు తట్టి, నన్ను తెల్లవారేదాకా వారింట తలదాచుకోనిమ్మని శిఫార్సుచెయ్యి," అన్న దామె.

ఆమెనుంచి అదివరకే రెండు వేల దీనారాలు పొందిఉన్నవాడు కావటంచేత కాజీ కూతురికి సహాయపడి పుణ్యంకూడా సంపాదించుకుందా మనుకున్నాడు ముయీన్.

"నాకు నీకన్న మంచి మొగుడు దొరకడనా? విను. నాకొక చిన్న సహాయం చెయ్యాలి. కాజీగారి కూతురూ, నేనూ ఆ బాల్యస్నేహితులం. నా స్నేహితురాలు ఒక అతన్ని ప్రేమిస్తున్నది. నే నామెకు రాయబారిగా పనిచేస్తున్నానని తెలిసి ఆ దుర్మార్గుడు నన్ను తన ఇంటికి రాకుండా కట్టుదిట్టం చేశాడు. నా సహాయం లేనట్టయితే నా స్నేహితురాలిని ఇంకెవరికో ఇచ్చి పెళ్లిచేసి ఆమె జీవితాన్ని కాజీ ధ్వంసం చేస్తాడు! అందుచేత నన్ను ఏదోవిధంగా కాజీ ఇంట ప్రవేశపెట్టటానికి నువ్వు పాటుపడాలి," అన్న దామె.

ఆ రాత్రి అతను రక్షకభటులను వెంటబెట్టుకుని గస్తీ తిరుగుతూ అర్ధరాత్రివేళకు అనుకున్న ప్రకారం కాజీ ఇంటివేపుగా వచ్చాడు. ఒక చెట్టుకింద చీకటిలో కూచుని ఉన్న నల్లని ఆకారం అతనికి కనిపించింది.

"ఎవరు నువ్వు?" అని ముయీన్ ఆ ఆకారాన్ని ప్రశ్నించాడు. వెంటనే ఆ ఆకారం లేచి నిలబడింది. ఆమె స్త్రీ అనీ, చాలా విలవైన దుస్తులు ధరించిందనీ రక్షకభటులు గుర్తించారు.



"అయ్యా, నేను నగలూ అవీ కొనటానికి సాయంకాలం నగరంలోకి వచ్చాను. ఆ పని పూర్తి అయాక నా స్నేహితురాళ్లను ఒకరిద్దరిని చూడటానికిగాను తిరిగాను. దురదృష్టవశాత్తూ ఒకరూ ఇంట లేరు. నేను ఒక అమీర్ కుమార్తెను. అయితే ఏం లాభం? నేను ఇంటికి తిరిగి వెళ్లేలోపుగా నగరద్వారం మూయటంచేత ఈ రాత్రికి తలదాచుకునే ప్రాప్తంకూడా లేకుండా పోయింది!" అన్నది ఆమె.

కొత్వాలు ముయీన్ తన రక్షకభటులతో, "ఈమె పెద్ద ఇంటి పడుచుగా ఉన్నది. ఈ రాత్రి ఈమెను దొంగలు దోచారంటే మనకు మాట వస్తుంది. కాజీగారిల్లు ఈ పక్కనే ఉన్నది. ఈమెను తెల్లవారిన దాకా ఉంచుకుంటారేమో అడుగుదాం!" అన్నాడు. తరవాత అతను కాజీని లేపి ఆయనతో ఆ ఆడకూతురి గొడవ చెప్పాడు.

"నాకేమీ అభ్యంతరం లేదు. ఈ రాత్రికి నా కుమార్తె గదిలో పడుకుని తెల్లవారగానే వెళ్లిపోవచ్చు," అన్నాడు కాజీ.

తన పని పూర్తి అయినందుకు సంతోషించి ముయీన్ గస్తీ ముగించి తన ఇంటికి వెళ్లి పడుకున్నాడు. మర్నాడు ఉదయం నిద్రలేస్తూనే అతనికి ఆ ఆడమనిషి జ్ఞాపకం



వచ్చింది. ఏదో పనిమీద ఆ దారిన వెళ్లే వాడల్లే అతను కాజీగారింటి మీదుగా పోతూ, లోపలికి తొంగి చూశాడు.

ముయీన్‌ను చూస్తూనే కాజీ తిట్టనారంభించాడు. "ఏం పని చేశావు? వెధవపని! రాత్రి ఎవతెనో దొంగముండను తెచ్చి నా యింట పెట్టి వెళ్లావు. తెల్లారేలోపుగా అది ఆరువేల దీనారాలు కాజేసి పారిపోయింది! నువు దొంగలను పట్టేది పోయి, దొంగలకు మద్దతు ఇస్తావా?" అని ఆయన పెద్దగా కేకలు పెట్టాడు.

ముయీన్‌కు కాళ్లు వణికాయి, కళ్ళు చీకట్లు కమ్మాయి. ఇప్పుడు ఆలోచించు





కుంటే ఆ ఆడమనిషి దొంగతనం చేయటానికి సమర్థురాలులాగే కనబడింది.

"అయ్యో, క్షమించాలి. ఆ మనిషి చెప్పిన మాటలు నమ్మాను. అనుమానించటానికి నాకేమీ కారణం కనబడలేదు. మీ సొత్తునూ, దొంగనూ తెచ్చే భారం నాది!" అన్నాడు ముయీాన్.

"దొంగలను పట్టుకునే భారం నీదికాక నాదవుతుందా? ఈ దొంగను మూడు రోజుల లోగా పట్టకపోయావో, నేనే స్వయంగా నీకు మరణశిక్షవిధిస్తాను!" అన్నాడు కాజీ.

ముయీాన్‌కు ముచ్చెమటలు పోశాయి. కైరోనగరంలో ఉండే లకలాది బురఖాలలో దేనిచాటున తనకు కావలిసిన స్త్రీ ఉన్నదీ ఎలా పోల్చటం? తనవల్ల కాదు గదా, ఏ మానవమాత్రుడివల్లా కాదు! "నాకు కాజీచేతుల్లో చావు రాసిపెట్టివుంది!" అనుకుంటూ ముయీాన్ ఇంటికి వెళ్లి వెల్లికిలా పడుకున్నాడు.

మూడు రోజులూ అతను ఇల్లుదాటి వెళ్లలేదు. మూడోనాడు ఉదయం ముయీాన్ లేచి కాజీ ఇంటికి బయలుదేరాడు. "నాకు దొంగ దొరకలేదు, మరణశిక్ష విధించండి!" అని కాజీతో అనటానికి అతను నిశ్చయించుకున్నాడు.

ముయీాన్ ఒక సందులోనుంచి వెళుతూ ఎందుకో తలఎత్తి చూశాడు. మేడపైనుండి ఒక స్త్రీ వెదురుతడిక తెరను పక్కకు తొలగించి తనకేసి చూస్తూ, పైకి రమ్మని సైగ చేసింది. ఆమెను ముయీాన్ క్షణంలో గుర్తించాడు—ఆ మనిషే!

గబగబా మెట్లెక్కి ముయీాన్ పైకి వెళ్లాడు. ఆమె నవ్వుతూ అతనికి ఎదురు వచ్చి, "నామూలంగా పెద్ద చిక్కులో పడినట్టున్నావే?" అన్నది.

"నీకోసం మూడు రోజులుగా నగరమంతా ఘాలిస్తున్నాను. ఏమిటి నీ ఉద్దేశం? నీ స్నేహితురాలికి తోడ్పడుతున్నావంటే





సహాయపడ్డాను గాని, కాజీ డబ్బెందుకు కాజేశావు?" అని ముయీన్ ఆమెతో అన్నాడు.

"ఎందుకా? వాడు వట్టి పిసినిగొట్టు గనక! ఆ డబ్బు గొడవంతా నీకెందుకు? ప్రస్తుతం నీ పీకపైకి వచ్చింది గనక నిన్ను కాపాడే మార్గం చెబుతాను విను. ఆ కాజీ నీమీద నేరం మోపజూస్తాడు. నువే అతనిపై ముందుగా నేరం మోపు. ఆయన ఇంటి వంటగది మూల ఒక జాడీ ఉన్నది. నువు ఇల్లంతా సోదా చేసినట్టు చేసి ఆ జాడీలో నుంచి ఒక మూట పైకి తియ్యి. అందులో నేనా రాత్రి ధరించిన బట్టలన్నీ ఉంటాయి. అవి నెత్తురుతో తడిసి ఉంటాయి. ఆ మూట విప్పగానే పులిలాటి కాజీ పిల్లి అయి పోతాడు. నిన్నిక ఏమీ చెయ్యలేడు!" అన్నదా దొంగమనిషి, అతని చేతిలో నూరు దీనారాలు పెడుతూ.

పోయే ప్రాణాలు తిరిగి వచ్చినట్టయింది ముయీన్‌కు. అతను ధాటీగా నడుచు కుంటూ కాజీ ఇంటికి వెళ్లాడు. కాజీ అతన్ని చూస్తూనే, "పనికిమాలినవాడా, నా సొమ్మెక్కడ, ఆ దొంగ ఎక్కడ?" అని రంకెలు వేశాడు.

"ఆ మాట మిమ్మల్నే అడగాలని వచ్చాను, కాజీగారూ! నేనూ, నా రక్షక భటులూ నగరమంతా జల్లించామంటే నమ్మండి. ఆ పిల్ల జాడ చెప్పినవారు ఒక్కరుకూడా లేరు. ఆమె మీ ఇంట్లో అడుగుపెట్టటం నేనూ, నా మనుషులూ కళ్లారా చూశాం. మీ ఇంటినుంచి ఆమె బయటికి వెళ్లటం చూసినవారు ఒక్కరు కూడా లేరు! ఆ పిల్లగాని ఆమె శవంగాని మీ ఆవరణలోనే దొరకాలి! దానికోసం వెతకటం కొత్వాలునైన నావిధి," అన్నాడు ముయీన్ దర్పంగా.

కాజీ మొహం పాలిపోయింది. కాస్సేపు ఆయన నోట మాటరాలేదు. చివరకాయన, "నువ్వనేది అసంభవం! ఆమెను ఎవరూ



చంపలేదు. ఎందుకు చంపుతాం? పైన పోయిన నా ఆరువేల దీనారాల మాటే మిటి?" అన్నాడు.

"దానికైనా సాక్ష్యం ఏమున్నదీ? మీ మాటేగా?" అన్నాడు కొత్వాలు.

ముయీాన్ ఇల్లంతా వెతికాడు, దొడ్డి అంతా వెతికాడు. ఎక్కడా ఆడమనిషి జాడ లేదు; ఉండదని అతనికీ తెలుసు. చివరకు అతను తప్పుచేసినవాడి మొహం పెట్టి కాజీగారి వంటగదిలోకి వచ్చి ఒక స్తంభాన్ని అనుకుని నిలబడ్డాడు. ఆ గది మూల జాడీ ఒకటి ఉన్నది.

ఇప్పుడు కాజీకి మళ్ళీ కాస్త ధైర్యం వచ్చింది. ఆయన కొత్వాలుతో, "ఏదీ, ఆ మనిషి శవం? నేను హంతకుణ్ణంటివే! సొమ్ము పోయిందని అబద్ధాలాడానంటివే! నా అబద్ధాలూ, హత్యలూ రుజువు చెయ్యవేం? నామీదనే ఇంతసేరం మోపుతావుగా!" అంటూ గట్టిగా రంకెలు పెట్టసాగాడు.

అకస్మాత్తుగా ముయీాన్ తల ఎత్తి, "నెత్తురువాసన! ఆ జాడీవేపునుంచి వస్తున్నది!" అంటూ పరిగెత్తివెళ్ళి మూల నున్న జాడీలో చెయ్యిపెట్టి ఒక మూట పైకి తీశాడు. ఆ మూట విప్పితే అందులో నెత్తురుతో తడిసిన దుస్తులున్నాయి. ఆ దుస్తులు ఆ రాత్రి తన ఇంట పడుకున్న స్త్రీ ధరించినవేనని కాజీ గుర్తించాడు. ఆయన వణికిపోతూ కొత్వాలుతో, "నేను పెద్దవాణ్ణి, పరువుగా బతుకుతున్నవాణ్ణి. నేను ప్రమాణపూర్తిగా ఆ పిల్లను హత్య చెయ్యలేదు. కాని ఈ దుస్తులమాట పైకి పొక్కిందంటే నా పరువు కాస్తా పోతుంది. ఈవిచారణ ఇంతటితో పోనిచ్చావంటే నీకు నా కృతజ్ఞత చూపుతాను!" అంటూ అతని చేతులు పట్టుకున్నాడు.

కొత్వాలు కాజీవద్ద వెయ్యి దీనారాలు పుచ్చుకుని, ఆ బట్టలను కాజీ ఎదటనే తగలబెట్టి తన దారిన వెళ్ళిపోయాడు.






## 8

[మంత్రగత్తె అయిన కాపాలిని, చంద్రవర్మకు ఆతిథ్యం యిచ్చి, భైరవుడనే తన నౌకరు చేత అతడికి విందుభోజనం పెట్టించింది. తరవాత ఆమె శంఖుడనే మాంత్రికుడివద్ద వున్న అపూర్వశక్తులు గల శంఖాన్ని తీసుకురావలసిందిగా అతణ్ణి కోరింది. కొన్ని మూలికలతో కాచిన కషాయం ఆ శంఖంలో పోసుకుని తాగితే, తను మరి వెయ్యేళ్లు హాయిగా జీవించగలనని చెప్పింది. చంద్రవర్మ సరేనని బయలుదేరాడు. తరవాత—]

ముందు దారి చూపుతూ నడుస్తున్న కాలనాగును వెన్నంటి చంద్రవర్మ నడవసాగాడు. సర్పం తన మూడు తలలనూ అన్ని దిక్కులకూ తిప్పుతూ, మధ్యమధ్య పెద్దగా బుసలుకొడుతూ గుబురు చెట్ల మధ్యగా పోసాగింది. ఆ చెట్ల కింద అనేక క్రూరజంతువులూ, విషసర్పాలూ ఆ యిద్దరికీ ఎదురయినై. కాని, కాలనాగును చూస్తూనే అవి చెల్లాచెదరుగా పరిగెత్తసాగినై.

ఆ విధంగా అడవిలో కొంతదూరం వెళ్లిన తరవాత చంద్రవర్మకు హఠాత్తుగా ఒక అనుమానం వచ్చింది. కాలనాగు మానవ భాషను అర్థంచేసుకుంటున్నది. మాంత్రికురాలు మరో మనిషితో మాట్లాడినట్టే దానితో మాట్లాడి, ఆజ్ఞలు యిచ్చింది. కాని, అది మానవభాషలో మాట్లాడినట్టు తను వినలేదు. తను ప్రయత్నించితే కాలనాగు మాట్లాడగలిగేదీ లేనిదీ తేలిపోతుంది.




చంద్రవర్మ యిలా ఆలోచించి, కాలనాగు దగ్గరగా వెళ్లి, "కాలనాగూ! మనం యీ అడవిని దాటాలంటే యింకా ఎంతదూరం నడవాలి?" అని ప్రశ్నించాడు.

చంద్రవర్మ ప్రశ్న వింటూనే కాలనాగు ఠక్కున ఆగిపోయింది. దాని మూడు తలలూ ఒకేసారి భూమిమీదినుంచి పైకి లేచి చంద్రవర్మ కళ్లల్లోకి సూటిగా చూసినై. మరుక్షణం అది తన నాలుకలను ముందుకు సాచి చిన్న శబ్దం చేసింది. ఆ ధ్వని మామూలుగా అది కొట్టే బుసలలాగా లేదు. అందులో ఒకదానివెంట ఒకటిగా రెండు మూడు రకాల శబ్దాలు వినిపించినై.

చంద్రవర్మ ఆశ్చర్యపోయాడు. అది గ్రహించినదానిలా కాలనాగు తన మూడు తలలనూ అటూయిటూ తిప్పి, వెళుతున్న మార్గంనుంచి పక్కకు తొలిగి మరొక దిక్కుగా పోతూ, అనుసరించి రావలసిందిగా చంద్రవర్మకు సంజ్ఞ చేసింది.

కాలనాగు తనకేదో రహస్యం చెప్ప చూస్తున్నదని చంద్రవర్మ గ్రహించాడు. అందువల్ల అతడేమాత్రం సంశయించకుండా దాన్ని అనుసరించి నడవసాగాడు. కొద్ది సేపటికి ఇద్దరూ చీకటిమయంగా వున్న గుబురుచెట్లలోంచి బయటపడి, సెలయేరు ఒకటి ప్రవహిస్తున్న చోటుకు చేరారు.

కాలనాగు సెలయేటిముందు ఆగి తన తలలతో దాని అవతల వున్న ఒక వింత వృక్షంకేసి చూపింది. చంద్రవర్మ అటుకేసి చూసేంతలో వికారమైన నవ్వులూ, కేకలూ కూతలూ వినిపించినై. ఆ విచిత్ర ధ్వనులు వస్తున్న వృక్షంకేసి చూస్తూనే చంద్రవర్మ నిలువెల్లా వణికిపోయాడు.

అది ఒక వింతవృక్షం. నలభై యాభై అడుగుల ఎత్తున గుమ్మటంలా గుబురుగా పెరిగిన ఆ వృక్షానికి రకరకాల జంతువుల తలలూ, పక్షుల తలలూ వేలాడుతున్నవి. అవి చంద్రవర్మనూ, కాలనాగునూ చూస్తూనే





జంతువులలాగా అరవటం, పక్షులలాగా కూయుటం ప్రారంభించినై.

చంద్రవర్మ వృక్షం మీదినుంచి తన దృష్టిని కాలనాగుకేసి తిప్పాడు. కాలనాగు అతడికేసే నిశ్శబ్దంగా చూస్తున్నది. చంద్రవర్మ వింతవృక్షానికేసి చేయి చూపుతూ, "అది వృక్షమా? లేక ఆ రూపంలో వున్న ఏదైనా భయంకర రాక్షసా?" అని అడిగాడు.

కాలనాగు నిశ్శబ్దంగా తలలు ఆడించి సెలయేటికేసి నడిచింది. చంద్రవర్మ దాని వెనకనే బయలుదేరాడు. కొద్దిసేపటికల్లా కాలనాగు ఆ వింతవృక్షం దగ్గిరకు వచ్చి ఆగింది. చంద్రవర్మకూడా అక్కడికి వచ్చేంతలో వృక్షం మీదినుంచి మరింత భయంకరంగా అరుపులు రాసాగినై. చంద్రవర్మ గుండె రాయిచేసుకున్నాడు.. ఒకవేళ కాలనాగు తనను మోసగించి హతమార్చ దలిచినా తను చేయగలిగిందేమీ లేదు. ఈ అడవి ప్రవేశిస్తూనే తను మాంత్రికురాలి శక్తికి లోబడిపోయాడు. తన దేహబలంగాని, ఒరలోని కత్తిగాని యీ మంత్ర తంత్రాల బారినుంచి తనను రక్షించలేవు. ఈ నిమిషంలో తనకు మేలుగానీ కీడుగానీ జరగటం సంభవిస్తే అదంతా మాంత్రికురాలి ఆజ్ఞల వల్లనే జరుగుతుంది.

చంద్రవర్మ యిలా ఆలోచిస్తున్నంతలో కాలనాగు అతడికి మరింత దగ్గిరగా వచ్చి, తలలుఎత్తి వృక్షంకేసి సంజ్ఞ చేయసాగింది. సర్పం తనను వృక్షం ఎక్కమంటున్నదని చంద్రవర్మ గ్రహించాడు. అతడు ఒరలోనుంచి కత్తి దూసి నిర్భయంగా చెట్టును సమీపించి దానితో చెట్టుబోదెను ఒక్కసారి గట్టిగా పొడిచాడు. ఆ వెంటనే అడవి దద్దరిల్లేలా హాహాకారాలు వినిపించినై. కాలనాగు భయంతో వణికిపోతున్నదానిలా శరీరాన్ని కుంచించి చంద్రవర్మ ముందుకు వచ్చింది. చంద్రవర్మ యివేమీ గమనించే స్థితిలో లేడు. చెట్టున వేలాడుతూ తనను








పెడుతూన్న ఒక తలను కొమ్మనుంచి నరికాడు. మరుక్షణం అది దభీమంటూ కింద పడిపోయింది. చంద్రవర్మ ఆశ్చర్యానికి అంతులేదు. భూమిమీద పడిన ఆ పెద్దపులి శిరస్సు పండులా మారిపోయింది.

చంద్రవర్మ గబగబా చెట్టు దిగి వచ్చేంతలో, కాలనాగు ఆ పండును నోట కరుచుకుని అతడికేసి తిరిగింది. చంద్రవర్మ ఆ పండును తీసుకుని గట్టిగా కొరికి చూశాడు. మరుక్షణం కాలనాగు పెద్దగా నవ్వుతున్నట్టు అతడికి వినబడింది. చంద్రవర్మ దానికేసి తిరిగి చూశాడు.

"చంద్రవర్మా, యిప్పుడు తెలిసిందా, యీ వృక్షానికి వేలాడుతున్న వింత తలల సంగతి?" అన్నది కాలనాగు.

ఆ మాటలతో చంద్రవర్మకు అంతా అర్థం అయిపోయింది. తను పండును కొరుకుతూవుండగానే తనకు కాలనాగు మాట్లాడే మాటలు తెలిసిపోయినై. ఆ క్షణం వరకూ అది చేసే ధ్వని కేవలం పాము బుసలాగే వుంది.

"ఆ పండును కొరకటంతో నీకు పశుపక్ష్యాదుల భాష అవగతం అయింది. మాంత్రికుడైన శంఖుణ్ణి చేరటానికీ, అతణ్ణించి అపూర్వ శక్తులు గల శంఖాన్ని

వికృత ధ్వనులతో భయపెట్ట చూస్తున్న జంతువులా పక్షులా తలలను తన కత్తితో నరికి కింద పడకొట్టటానికి అతడు నిశ్చయించుకున్నాడు.

కాలనాగు చెట్టు బోదెవద్దకు వెళ్ళి, శరీరాన్ని దానికి చుట్టబెట్టి కొమ్మలకేసి ఓమారు చూసింది. అది చెప్పదలిచినదేదో గ్రహించినవాడిలా చంద్రవర్మ చరచరా చెట్టుమీదికి పాకాడు. ఈలోపల వృక్షానికి వేలాడుతున్న తలలనుంచి వికృతమైన అరుపులు ఎడతెరిపి లేకుండా వినపడసాగినై. చంద్రవర్మ నిర్భయంగా కొమ్మలలోకి వెళ్ళి తన కత్తితో పెద్దపులి తలలా వుండి కోరలు సాచి భయ





తస్కరించటానికీ యిది ఎంతగానో తోడ్పడుతుంది. అతడి భృత్యుడైన వింత అగ్నిపక్షి నుంచి ప్రమాదం రాకుండా నువు మసులుకోవలసివుంటుంది. ఇప్పుడు నీవు అన్ని జీవరాసుల భాషలనూ అర్థం చేసుకోగలవు గనక, నీ ప్రయత్నంలో విజయం సాధించే అవకాశం వుంది," అన్నది కాలనాగు.



చంద్రవర్మలో ఎక్కడ లేని వుత్సాహం వెల్లివిరిసింది. అతడు కాలనాగుకేసి కృతజ్ఞత వుట్టిపడే కళ్లతో చూస్తూ, "కాలనాగూ! నువ్వు నాకు చాలా గొప్ప సహాయం చేశావు. ఇందుకు ప్రతిగా నానుంచి నువ్వు కోరుతున్నదేమిటి?" అని అడిగాడు.

కాలనాగు విచారంగా తలలను కిందికి వాల్చి, "నువ్వు నాకు చేయవలసిన సహాయం ఏమంత పెద్దది కాదు. అయినా, నువ్వు శంఖుణ్ణుంచి ఆ అపూర్వ శక్తులు గల శంఖాన్ని తెచ్చేవరకూ నేను వేచివుండవలసి వుంది," అన్నది.

కాలనాగు యిలా జవాబిచ్చేసరికి, చంద్రవర్మకు అది అడగదలిచిన సహాయం ఏదో యిప్పుడే తెలుసుకోవాలని కోర్కె పుట్టింది. అతడు కాలనాగుకేసి అనుమానంగా చూస్తూ, "కాలనాగూ, నువ్వు నిజంగా సర్పానివా? లేక మానవుడివా?" అన్నాడు.

"నేను ఒకప్పుడు సర్పాన్ని కాదు; మానవుణ్ణే. శంఖుడికి శిష్యుడిగా వుండేవాణ్ణి. అతడు పంపగా కాపాలినికి హాని చేయటానికి వచ్చి, ఆమెకు దొరికిపోయి యిలా పామునైపోయాను. ఆ రోజునుంచీ నన్ను ఆమె భృత్యుడుగా వుపయోగించుకుంటున్నది. నీవు నీ ప్రయత్నంలో విజయం సాధించి వచ్చినట్టయితే, నన్ను యీ తుచ్ఛజీవితాన్నుంచి కాపాడగలవు," అన్నది కాలనాగు విచారంగా.

"ఈ మాత్రపుదానికి నువ్వు అంతకాలం వేచివుండ నవసరం లేదు. ఇప్పుడే వెను దిరిగి కాపాలిని దగ్గిరకు వెళదాం. ఆమె





చంద్రవర్మకు కాలనాగు మాటల్లో సత్యం ఉన్నట్టు తోచింది. ఈ మాంత్రికులూ, మంత్రగత్తెలూ నమ్మదగినవారు కారు. ఏ క్షణంలో వాళ్లు ఎవరిని గురించి ఎలాంటి అనుమానాలకు గురిఅవుతారో వూహించటం కష్టం. చంద్రవర్మ యిలా ఆలోచించి చెట్టు దగ్గరనుంచి ముందుకు కదిలాడు. కాలనాగు తిరిగి ఎప్పటిలాగా అతడికి ముందుండి దారి చూపసాగింది.

సరిగా మిట్టమధ్యాహ్నంవేళకు వాళ్లిద్దరూ దట్టంగా వున్న అడవిప్రాంతాన్ని దాటగలిగారు. ఎదురుగా పెద్ద కొండలూ లోయలూ కనిపించినై. ఆ ప్రాంతాలకూడా చెట్లూ పొదలూ వున్నవి గాని, అవి అంత చిట్టడవిలా కనిపించటంలేదు.

"చంద్రవర్మా! ఇక నేను వెనక్కు తిరిగిపోతాను. కాపాలిని ఆజ్ఞప్రకారం నిన్ను యీ అడవి దాటించాను. ఇక ముందుకు నీవు ఒంటరిగా వెళ్లవలసిందే! ఆ కనిపించే కొండలూ, కనుమల్లో నువ్వు అడుగడుగునా ప్రమాదాలను ఎదుర్కొవలసి రావొచ్చు. కాని, నువ్వు దిట్టతనం కోల్పోకపోతే, నీకు వచ్చిన పశుపక్ష్యాదుల భాషవల్ల అన్ని గండాలనూ గడిచి, విజయం సాధించగలవు," అన్నది కాలనాగు.

నా మాటను తోసివేయలేదు. నీకు తిరుగా మానవరూపం ప్రసాదించవలసిందిగా ఆమెను కోరతాను," అన్నాడు చంద్రవర్మ.

ఇందుకు కాలనాగు అంగీకరించలేదు. "కాపాలిని సంగతి సొంతంగా నీకు తెలియదు, వర్మా! వట్టి అనుమానం మనిషి. మనిద్దరమూ ఏకమై తనకేదో ద్రోహం తలపెట్టామని ఆమె భావించినా భావించవచ్చు. అలా జరిగితే, నాతోపాటు నీకూ మరింతగా కీడు జరుగుతుంది. ఇంతకాలంగా యీ సర్పజీవితం గడుపుతున్నాను. మరికొద్ది రోజులు వేచివుండటం నాకేమంత కష్టం కాదు," అన్నది కాలనాగు.





ఆ తరవాత చంద్రవర్మ దగ్గిర సెలవు తీసుకుని కాలనాగు వచ్చిన మార్గాన బుసలుకొడుతూ బయలుదేరింది. చెట్లలో అది కనబడుతున్నంతవరకూ దానికేసి చూసి, చంద్రవర్మ పెద్దగా నిట్టూరుస్తూ తను పోవలసిన మార్గంకేసి నడిచాడు.

మార్గం అంతా చిన్నా పెద్ద రాళ్లతోనూ, ముళ్లపొదలతోనూ నిండి వున్నది. అక్కడక్కడా ఆకాశాన్నంటుతున్న మహావృక్షాలు వున్నవి. ఆ ప్రాంతాల తిరుగాడే మృగాలూ పక్షులూ చేసే కలకలనాదం చంద్రవర్మకు స్పష్టంగా వినబడుతున్నది. కాని పూర్వంలా కాకుండా యిప్పుడా ధ్వనులలో అతడికి అవి మాట్లాడుకునే మాటలు అర్థం అవుతున్నవి. ఏదో ఒక కొత్తజీవి తమ నివాస ప్రాంతాలలో తిరుగాడుతున్నట్టుగా అవి ఒక దాని నొకటి హెచ్చరించుకుంటున్నవి.

సూర్యుడు నడినెత్తినుంచి పడమటికి వాలేవరకూ చంద్రవర్మ సూటిగా ఉత్తరపు దిక్కుకేసి నడిచాడు. ఆసరికి అతడికి ఆయాసంతోపాటు, ఎక్కడలేని ఆకలీ పుట్టుకొచ్చింది. అతడు ఒక పెద్ద చెట్టునీడకు వెళ్లి దాని బోదెకు నడుంవాల్చి కూర్చుని చుట్టూ కలయచూశాడు. కనుచూపుమేరలో ఎక్కడా ఫలవృక్షాలు వున్న సూచనలులేవు.



ఏవైనా దుంపలూ, కందమూలాలూ తిని కడుపు నించుకోటానికైనా అక్కడ ముళ్ల పొదలూ, రాళ్లగుట్టలూ తప్ప మరేమీ కనిపించలేదు.

"ఇక్కడ కాలం వృథాపుచ్చి లాభం లేదు. ఇంకా మరికొంత ముందుకు వెళితే, ఎక్కడైనా ఫలవృక్షాలు కనబడవచ్చు," అనుకుంటూ చంద్రవర్మ చెట్టునీడనుంచి లేచి బయలుదేరాడు. అతడు కొంతదూరం నడిచి ఒక పెద్దరాయి మలుపు తిరిగేసరిగి ఎదురుగా ఫలభారంతో వంగిపోయిన అనేక వృక్షాలు కనిపించాయి. చంద్రవర్మకు ఎక్కడ లేని ఆనందం కలిగింది. అతడు



చిన్నచిన్న రాళ్లనూ, ముళ్లపొదలనూ తప్పుకుంటూ వేగంగా ముందుకు నడిచాడు. ఒకటిరెండు నిమిషాలు గడిచేసరికి శరీరాన్ని ఏవో వేడిగాడ్పులు తాకినట్టయింది. చంద్రవర్మ ఆశ్చర్యపడుతూ మరికొంత ముందుకు వెళ్లాడు. అతడు నిలబడివున్నచోటుకు దిగువగా ఒక పెద్దవాగు కళకళలాడుతూ వేడి పొగలు వెడలగ్రక్కుతూ ప్రవహిస్తున్నది.

చంద్రవర్మ ఆ వింతవాగును చూస్తూనే నిర్విణ్ణుడయాడు. ఎక్కడో అగ్నిపర్వతం నుంచి ఆ వేడినీరు ప్రవాహం కట్టి వేడి గాడ్పులు వెదజల్లుతూ జాలువారుతున్నదని అతడు గ్రహించాడు. తను ఆకలికి మాడి చావకుండా వుండాలంటే, ఎట్టి పరిస్థితులలోనైనా తను యీ వేడినీటి వాగును దాటక తప్పదు. ఫలభారంతో వంగివున్న వృక్షాలన్నీ వాగుకు అవతలి ఒడ్డున వున్నవి.

ఏమి చేయుటమా అని చంద్రవర్మ ఆలోచించేంతలో ఒక మహాసర్పం మిట్టగా వున్న ప్రదేశాన్నుంచి నిలువునా తాడిచెట్టులా లేచి తలభాగం వాగుకు అవతల పడేలా వాలింది. తరవాత తలతో ముందుకు పాకుతూ, తోకను కొంచెం కొంచెంగా కదిలిస్తున్నది. అదే సమయంలో నాలుగైదు కోతులు కిచకిచమంటూ చెట్లమీదినుంచి డిగి, వాగుకు అడ్డంగా తాగాడిలా వున్న సర్పంమీదినుంచి నడిచి, అవతలివైపుకు పరిగెత్తినై.

తను ఈ వేడినీటి వాగును దాటాలంటే, ఆ కోతులలాగే సాహసించి, ఆ పెనుపాము వెన్నుమీదుగా అవతలికి పరిగెత్తవలసి వుంటుందని చంద్రవర్మ గ్రహించాడు. ఆ ప్రయత్నంకూడా పాము తన శరీరాన్ని అవతలి ఒడ్డుకు లాక్కోకముందే చేయాలి. ఇలా అనుకుంటూ చంద్రవర్మ వున్నచోటు నుంచి కదిలి ఒక్క వురుకున పాము వున్న చోటుకు వెళ్లి, దాని వెన్నుమీదుగా అవతలి ఒడ్డుకు పరిగెత్తసాగాడు.

—(ఇంకా వుంది)






# 2

తన అన్ననూ, తన తండ్రి ఒంటెలనూ పట్టుకున్న రషీద్ తన బిడారుతో ఇంకా మూడురోజులకు మక్కా చేరుకుంటాడనగా కనానా ఆ బిడారును అందుకున్నాడు. అతను తన తలపాగాను ముఖంమీదికి కప్పుకుని ఆ బిడారు వెంట మూడురోజులు ప్రయాణం చేసి తెలుసుకోదగిన విషయాలన్నీ తెలుసుకున్నాడు.

ఒకనాటి మధ్యాన్నం బాగా ఎండ ఎక్కి రషీద్ బిడారు మక్కానగరం చేరింది. అది చేరే సమయానికి ఖలీఫా ఉమర్ మరొక మనిషితో మాట్లాడుతూ, మహమ్మదీయులకు అత్యంత పవిత్రస్థలమైన కాబా ఆవరణ సమీపంలో గల ద్వారంవద్ద నిలబడి ఉన్నాడు రషీద్ ఒంటెలలో బరువులు మోసేవి వెనక దిగబడిపోయాయి. ఖాళీ ఒంటెలు కాబా వద్దకు వచ్చాయి. వాటికి ముందుగా ఒక తెల్ల ఒంటె, అన్ని ఒంటెల కన్న ఎత్తుగా, హుందాగా ముందు నడుస్తున్నది. అది "ఎడారి భయంకరు"డిది; దానిపై ఉన్నవాడు కనానా పెద్ద అన్న.

ఒంటెలు ఒకటొకటే కాళ్ళు ముడిచి నేలపై ఒరుగుతున్న సమయంలో కనానా అక్కడికి వచ్చాడు. అతనికి దారి చూపుతూ వచ్చిన కుర్రవాడు కనానాతో, "అరుగో ఆయనే!" అని ఖలీఫాను చూపాడు.

తన ముఖం ఎవరికీ కనిపించకుండా కప్పుకుని ఉన్న కనానా ఖలీఫాను సమీపించి, మోకరించి లేచి, "ఖలీఫా ఉమర్ గారికి జాబు!" అంటూ, సైనికుడు చనిపోతూ తనకిచ్చిన జాబును అందించాడు.

ఆ సమయంలోనే అతను తన తలపాగా తోకలను పక్కకు తొలగించి ముఖాన్ని ఖలీఫాకు చూపాడు.

జి. కేశవరావు



"నీ కింకా గడ్డమైనారాలేదే, ఈ జాబులో ఏమున్నదో నీకు తెలుసా?" అని ఖలీఫా కనానాను అడిగాడు.

సైనికుడు తనతో అన్న మాటలను కనానా ఖలీఫాకు వివరంగా చెప్పాడు.

"ఇంత ముఖ్యమైన జాబు తెచ్చేవాడు మక్కా వీధులలో తోడులేకుండా నడవట మేమిటి?" అన్నాడు ఖలీఫా.

"హెూర్‌కొండ వద్దనుంచి ఈ జాబును నేను ఒంటరిగానే తెచ్చానని ఏలినవారు గ్రహించాలి!" అన్నాడు కనానా.

ఆ జాబు కనానాకు ఎలా లభించిందీ విన్న తరవాత ఖలీఫా, "నువు చాలా ధైర్యం కలవాడివి. నా యింటికి వెళ్లి నేను వచ్చిన దాకా ఉండు!" అంటూ ఒక నీగ్రో బానిస వెంట కనానాను తన ఇంటికి పంపాడు.

నీగ్రోబానిస వెంట నడుస్తూ కనానా, "నా పరీక్ష ముగిసింది. ఖలీఫాకు జాబు అందజేశాను. ఇక నా సొంతపని మిగిలి ఉన్నది. ఖలీఫాచేత ధైర్యంగల వాణ్ణని పించుకున్నాను. నా అన్ననూ, తెల్ల ఒంటెనూ మా నాన్నకు వప్పగించి ఆయన మెప్పుకూడా పొందితే నా కింకేమీ అవసరం లేదు," అనుకున్నాడు. ఖలీఫాను తాను మళ్ళీ చూడవలసిన పనేమిటి? బానిసవాణ్ణి ఏమార్చి ఎక్కడైనా జారుకుందామని కనానా అనుకునేటంతలో ఇద్దరూ ఖలీఫా ఇల్లు చేరుకున్నారు. ఒక బ్రహ్మాండమైన ద్వారంలోనుంచి వారు చలవరాళ్ళు పరి చిన ఆవరణ దాటి ఖలీఫా భవనంలోకి అడుగు పెట్టారు. నీగ్రో బానిస కనానాను ఒకచోట కూచోబెట్టి వెళ్ళాడు.

కొంచెంసేపటికి ఖలీఫా వచ్చాడు. కనానా నుదురునేలకు అనించి ఆయనకు ప్రణామం చేశాడు. ఖలీఫా కూచుంటూ, "నాయనా, ఎందరో సాహసికులు చేయలేని పని నువు సాధించావు. ఏం బహుమానం కావాలో కోరుకో," అన్నాడు.

"ఖలీఫాగారి ఆశీస్సులు కావాలి," అన్నాడు కనానా.

"వాటికి ఏమీ లోటువుండదు. ఇంకేం కావాలి? ఒంటెలా, గొర్రెలా, బంగారమా?" అన్నాడు ఖలీఫా.

"వాటిని ఏం చేసుకోను? నన్ను ఆశీర్వదించి, నాకు సెల విప్పించండి. అంతే చాలు," అన్నాడు కనానా.

"నువు నన్నేమీ కోరకుండా ఉన్నావు గాని, నేను నిన్ను ఒకటి కోరాలనుకుంటున్నాను. అల్లా కోసం యుద్ధం చేసే సేనాపతులలో ఖాలిద్ సర్వోత్తముడు. అతను కొద్దిరోజులలో బస్రా చేరి అక్కడినుంచి ముప్పైవేలమంది సైనికులతో పర్షియాకు బయలుదేరుతాడు. పర్షియాకు మారుగా సిరియాకు వెళ్ళమని హెచ్చరిస్తూ ఒక జాబు రాసి కొందరు సైనికులచేత పంపుతున్నాను. ఇక్కడినుంచి బస్రాకు మూడు వారాల ప్రయాణం. ఈ లోపుగా నేను మతాభిమానులను అతని నాయకత్వంకింద పోరాడమని హెచ్చరిస్తూ తాఖీదులు పంపిస్తాను. నా జాబు తీసుకుపోయే సైనికుల వెంట నువుకూడా వెళ్ళి ఉన్న పరిస్థితులు ఖాలిద్‌కు తెలియజేస్తావా?" అని ఖలీఫా కనానాను అడిగాడు.



"దారి చాలా కష్టం. ఈ కాలంలో మక్కానుంచి బస్రా వెళ్లే దారిలో ఒక్క చుక్క నీరుండదు. దొంగల భయం జాస్తి," అన్నాడు కనానా.

"నీకు ఏ కష్టమూ రాకుండా, ఏ భయమూ కలగకుండా సదుపాయాలు చేయిస్తాను," అన్నాడు ఖలీఫా.

"నా విషయం నేను మాట్లాడటంలేదు. మీ సైనికుల మాట చెబుతున్నాను. ఈ జాబు తెచ్చిన సైనికులకు పట్టినగతే మీ సైనికులకూ పడుతుంది. నేను కష్టాలకూ, ఆపదలకూ జంకేవాణ్ణికాను. మీరు చెపుతున్న ఆ జాబు నా చేతికివ్వండి, నేను దాన్ని

ఖాలిద్‌కు అరు నూరైనా అందజేస్తాను," అన్నాడు కనానా.

"వెంట తోడు లేకుండా వెళతావా?" అన్నాడు ఖలీఫా.

"తండ్రీ, మోయలేని కత్తి ఎంతో మీరు నా కిచ్చేతోడుకూడా అంతే," అన్నాడు కనానా వినయంగా.

అతని మాటలకు ఖలీఫా ఆశ్చర్యపడ్డాడు.

"సరే నీకు ఉత్తరం ఇస్తాను. కాని దాని నకళ్లు నా సైనికులద్వారా ఇంకో మార్గాన విడిగా పంపిస్తాను. ఎప్పుడు బయలుదేరుతావు? అని ఖలీఫా అడిగాడు.

"ఈ క్షణమే," అన్నాడు కనానా.

"భేష్. నీకు ఎన్ని ఒంటెలు కావాలి? వెంటవుండేందుకు ఎంతమంది నౌకర్లు కావాలి?" అని ఖలీఫా అడిగాడు.

"ఇక్కడికి వచ్చేదారిలో నాకొక బిడారు తగిలింది. ఆ బిడారుకు ముందుండి నడిచిన తెల్లఒంటె నాకు నచ్చింది. దాన్ని, దాన్ని నడిపేవాణ్ణీ ఇప్పించండి. నాకోసం వడిగా వెళ్లే మరొక ఒంటెనూ, పధ్నాలుగు రోజులకు సరిపడే ఆహారాన్నీ ఇప్పించండి," అన్నాడు కనానా.

"ప్రయాణం ఇరవైరోజులకు ఎక్కువే పడుతుంది!" అన్నాడు ఖలీఫా తల అడ్డంగా తిప్పుతూ.



"బరువు ఎంత తక్కువగా ఉంటే ఒంటె అంత తేలికగా నడుస్తుంది. మరొ కరికైతే అది మూడు వారాల ప్రయాణం కావచ్చు, నాకు పధ్నాలుగురోజులు చాలు," అన్నాడు కనానా.

ఖలీఫా తన నౌకర్లను పిలిచి, "ఇవాళ వచ్చిచేరిన బిడారులో తెల్లఒంటె ఒకటి ఉన్నది. దాన్ని తోలేవాడితోసహా పట్టుకు రండి. నా నల్లఒంటెను ప్రయాణానికి సిద్ధం చేయించండి," అని ఉత్తరువు లిచ్చాడు.

త్వరలోనే ప్రయాణసన్నాహాలు ముగి శాయి. మునిమాపువేళ కనానా ఖలీఫా భవనంనుంచి వచ్చి తనకోసం వేచిఉన్న తెల్లఒంటెపై ఎక్కాడు. అతని అన్న నల్ల ఒంటెను పట్టుకుని నిలబడ్డాడు. కనానా ముఖం మామూలుప్రకారం కప్పి ఉండటం చేత అన్న తన తమ్ముణ్ణి గుర్తించలేదు. అతను, "ఎక్కడికి?" అని ప్రశ్నార్థకంగా చూశాడు. "తయీఫ్!" అన్నాడు కనానా.

తయీఫ్ అనేది మక్కాకు తూర్పుగా కొద్దిదూరంలో ఉండే ఒక నగరం. కనానా ఈ నగరం పేరు చెప్పటం ఆ సమీపంలో ఉన్న కొందరు మనుషులు విన్నారు. వారు రషీద్ మనుషులు. తాను కొల్లగొట్టిన తెల్ల ఒంటెకోసం ఖలీఫా అడిగాడని తెలిసి, దాన్ని తిరిగి ఎలాగైనా సంపాదించుకోవా






లని రషీద్ తీర్మానించుకుని, అది ఏ దిక్కుగా పోతుందో తెలుసుకోమని తన మనుషులను పంపాడు. వాళ్లు రషీద్ కోరిన ప్రకారమే వార్త తెచ్చారు.

* * *

త్వరలోనే రెండు ఒంటెలూ మక్కా నగరాన్ని దాటి తూర్పుగా బయలుదేరాయి. అవి మక్కా ద్వారాన్ని దాటిన కొద్దిసేపటికి అయిదుగురు అశ్వికులు అదే దిక్కుగా బయలుదేరారు.

తెల్లఒంటెపైన కూచున్న కనానా మనసులో ఆందోళనగానే ఉంది. చుట్టూ ఎక్కడా జనసంచారం లేదు. చాలా చీకటిగా ఉన్నది. అతను వెనక్కుతిరిగి చూసి తమను ఎవరో వెంబడించి వస్తున్నట్టు తెలుసుకున్నాడు.

అతను తన అన్నకేసి తిరిగి, "ఎందుకు నడుస్తావు. ఆ నల్లఒంటె నీకోసం తెచ్చినదే. ఎక్కు!" అన్నాడు.

"యజమానీ, తెల్లఒంటె నాకు తప్ప నడవదు. అది నాకు అలవాటైనది," అన్నాడు కనానా అన్న.

"ఊరికే మాట్లాడక నేను చెప్పినట్టు చెయ్యి. ఆ నల్లఒంటెకన్న వేగంగా పోయే ఒంటె మక్కాలో లేదు. అది ఖలీఫాగారి సొంతవాహనం. నువు దాన్ని ఎక్కి నాతో సమంగా రాగలిగితే మనం రషీద్ కళ్లలో దుమ్ము కొట్టవచ్చు," అన్నాడు కనానా.

తన యజమాని రషీద్ పేరు ఎత్తటం విని ఒక్కక్షణం నివ్వెరపోయి కనానా అన్న నల్లఒంటెపై ఎక్కాడు.

కనానా కదలమనగానే తెల్లఒంటె కదిలింది. దాని వెనకనే నల్లఒంటె దానంతట అదే కదిలింది. ఒంటెలు ఆగిన సమయంలో అశ్వికులుకూడా దూరాన ఆగారు. వారి దురుద్దేశం వెల్లడి అయింది.

కనానా తన తెల్లఒంటెను వేగంగా నడిపించసాగాడు. వెనక వచ్చే గుర్రాల వేగం

కూడా హెచ్చింది. కనానా తన ఒంటె వేగాన్ని క్రమంగా హెచ్చించాడు. నల్లఒంటె దానికి తీసిపోకుండా నడవసాగింది. గుర్రాల వేగం కూడా హెచ్చింది.

కనానా తెల్లఒంటెను అతివేగంగా దౌడు తీయించాడు. నల్లఒంటె కొంచెం వెనక బడింది. గుర్రాలు పూర్తిగా వెనకబడి పోయాయి. కాని ఒంటెల వేగం తగ్గలేదు. మక్కానుంచి వచ్చే ప్రయాణీకులు మజిలీ చేసే చోటు వచ్చింది, కాని ఒంటెలు ఆగ లేదు. తయీఫ్ నుంచి వచ్చే బిడారు ఎదు రయింది. అది మక్కాకేసి వెళ్లిపోయింది.

అది కనుచూపుమేర దాటిపోగానే కనానా తన ఒంటెను ఈశాన్యదిక్కుకు మళ్లించాడు. అతని అన్న ఆశ్చర్యపడ్డాడు. మక్కానుంచి పర్షియా వెళ్లేవాళ్లు నిలిచే రెండో మజిలీ కూడా దాటిపోయింది, కాని కనానా తను ఎక్కిన ఒంటెను ఆపలేదు.

వెనకపడిపోతున్న నల్లఒంటెను అదిలించి ముందుకు తెచ్చి కనానా అన్న, "యజమానీ, మనం తయీఫ్ దిక్కుగా పోవటంలేదు," అన్నాడు.

"లేదు," అన్నాడు కనానా.

"యజమానీ, ఆ ఒంటె చచ్చిపోతుంది," అన్నాడు కనానా అన్న.




"ఒక్క రాత్రికి చావదులే. నీ ప్రాణాలు ముందు కాపాడుకో," అన్నాడు కనానా.

ఎంతదూరం ప్రయాణించినా తెల్లఒంటె వేగం ఏమీ తగ్గలేదు. ఖలీఫాగారి నల్లఒంటె వెనకపడిపోసాగింది.

సూర్యోదయం అవుతూండగా కనానా తెల్ల ఒంటెను నిలిపాడు. కొద్దిసేపట్లో నల్లఒంటె వచ్చి కలుసుకున్నది. అన్న వచ్చి చేరేసరికి కనానా ఉదయప్రార్థనలో ఉన్నాడు. తరవాత ఇద్దరూ భోజనం చేశారు. ఖలీఫా దూత మొహం చూడాలని కనానా అన్న చాలా శ్రమపడ్డాడు గాని, తలపాగా తోకల చాటున ముఖం కనిపించలేదు.

పగలల్లా ఇద్దరూ నిద్రపోయి సాయంకాలం లేచారు.

"యజమానీ, ఈ రాత్రికి ఆ ఒంటెను అంత వేగంగా నడిపించవద్దు. దానికి నాలుగు వారాలుగా విశ్రాంతి అన్నది లేదు. దాన్ని బాధించేకన్న నన్ను చంపినా నేను సంతోషిస్తాను," అన్నాడు అన్న.

"దాన్ని ఎలా తోలాలో నువే చూసుకో. నేను నల్లఒంటెను ఎక్కుతున్నాను. ఇక నీదారి నీదీ, నాదారి నాదీ. నీదారి నేనే నిర్దేశిస్తాను. నువు సూటిగా ఉత్తరంగా వెళ్లు. నువు పది రాత్రులు ప్రయాణం చేయాలి!" అన్నాడు కనానా.

"నేను చేయవలసిన పని?" అన్నాడు అన్న ఆశ్చర్యంగా.

"బేనీసాద్ ముఠాను చేరుకుని, ఎడారి భయంకరుడితో, 'కనానా అన్నమాట నిలబెట్టుకున్నాడు,' అని చెప్పు," అంటూ కనానా నల్లఒంటెను ఎక్కి అదిలించాడు.

"మీరెవరు?" అని అన్న కేకపెట్టాడు. కనానా వెనక్కు తిరిగి చూసి, ముఖం మీద అడ్డం తొలగిస్తూ, "నేను నీ తమ్ముణ్ణి, కనానాను!" అని పెద్దగా కేకవేసి వడిగా ముందుకు సాగివెళ్లాడు.

"కనానా! తమ్ముడూ!" అని అన్న కేకలుపెట్టాడు. కాని ముంచుకువచ్చే చీకట్లో నల్లఒంటె మాయమయింది. "నా తమ్ముడు, తగినంత తిండి లేకుండా, ఆయుధం లేకుండా ఇలా వెళ్ళిపోగూడదు!" అనుకుంటూ అన్న తన తెల్లఒంటెను గట్టిగా కొట్టాడు. అతని మొరటుతనం చూసి తెల్లఒంటె మొరాయించింది. అయినా ఒక గంటసేపు అతను తన తమ్ముణ్ణి అనుసరించటానికి యత్నించాడు. ఆ యత్నం విఫలమయింది.

ఇక చేసేదిలేక కనానా అన్న దిగులుగా తన ఒంటెను ఉత్తరంగా తిప్పి ముందుకు సాగిపోయాడు. —(ఇంకా ఉంది)



# రత్ననిపుణుడు



విసుగుచెందని విక్రమార్కుడు తిరిగి చెట్టు వద్దకు వెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి తన భుజాన వేసుకుని, మరొకమారు శ్మశానంకేసి మౌనంగా నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు సర్వసమర్థుడవు. అందరూ నీలాగా ఉండరు. కొన్ని విషయాలలో అపూర్వ ప్రజ్ఞ ఉన్నవారికి మరికొన్ని విషయాలలో ఇంగితజ్ఞానంకూడా ఉండదు. ఇందుకు తార్కాణంగా నీకు రత్నవేది అనే యువకుడి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

కొంతకాలం కిందట హొయిసల రాజ్యంలో చిరకీర్తి అనే ఆయన ఉండేవాడు. ఆయన అన్ని రకాల ముడిరత్నాలూ కొని, వాటిని సానపట్టి రత్నవర్తకులకు విక్రయించి జీవిస్తూ ఉండేవాడు. రత్నాలను కొని సాన బట్టటం పెద్ద లాభసాటి బేరం కాదు. అయి

*బేతాళ కథలు*



దారు ముడి రత్నాలలో వచ్చే లాభం ఒక్క రత్నంలో పోయే అవకాశం ఉంది. ఎందుకంటే రాతిలో ఉన్న రత్నానికి విలవకట్టటం తేలిక పనికాదు. అందుచేత చిరకీర్తి ఏదో విధంగా కాలక్షేపం చేస్తూవస్తున్నాడు.

చిరకీర్తికి రత్నవేది అని ఒక కొడుకున్నాడు. వాడుకూడా తన వృత్తే అవలంబిస్తే పైకి రాలేకపోతాడనే ఉద్దేశంతో చిరకీర్తి వాడికి చదువు సంధ్యలు చెప్పించాడు.

రత్నవేది పన్నెండేళ్ల వయసువాడై ఉండగా ఒకనాడు వాణ్ణి తనవెంట బెట్టుకుని చిరకీర్తి ఒక రత్నవర్తకుడి ఇంటికి వెళ్లాడు. వారిద్దరూ అక్కడికి చేరేసరికి రత్నవర్తకుడి ఇంటి చుట్టూ ఇసకవేస్తే రాలకుండా జనం ఉన్నారు. కారణమేమంటే ఆ రత్నవర్తకుడు ఒక అపురూపమైన వజ్రాన్ని తెచ్చాడు.

తండ్రికొడుకు లిద్దరూ జనాన్ని తోసుకుని లోపలికి వెళ్లారు. రత్నవర్తకుడు చిరకీర్తితో, "ఈ వజ్రం చూశావా? దీన్ని పడమటి కొండలలో నేనే ఏరాను. ఎంతో శ్రమకూడా పడలేదు. కొండలలో నేనున్నది రెండే రోజులు. దీని నిప్పుడు లక్ష వరహాలకు అడుగుతున్నారు" అని చెప్పాడు.

తరవాత వారిద్దరూ వ్యాపారం విషయం ఏదో మాట్లాడుకున్నారు. అంతసేపూ రత్నవేది ఆ వజ్రాన్నే చూస్తూవచ్చాడు. దాన్ని తన చేతిలో పెట్టుకుని అటూ ఇటూ తిప్పి దాని అందాన్నీ, బరువునూ, తళతళనూ గమనించాడు. తరవాత తండ్రి కొడుకు లిద్దరూ ఇంటికి తిరిగి వచ్చేశారు.

ఈ సంఘటన జరిగినది మొదలు రత్నవేదికి రత్నాలను అన్వేషించాలని గాఢమైన కోరిక పుట్టుకొచ్చింది. అలాటి వజ్రం ఒక్కటి దొరికితే మూడు తరాలవారికి దారిద్ర్యం ఉండదు. అయితే వాడు తన కోరికను తండ్రితో చెప్పలేదు.

మరి రెండేళ్లు గడిచాయి. చిరకీర్తికి జబ్బుచేసింది. ఆయన కూడబెట్టినది కాస్తా

మందులకూ మాకులకూ ఖర్చయిపోయింది, కాని ఆయన వ్యాధి నయం కాలేదు.

తండ్రి చనిపోగానే రత్నవేది తననూ, తల్లినీ పోషించవలిసినవాడయాడు. "ఏం చేస్తావురా, నాయనా?" అని తల్లి అడిగితే, "అమ్మా, నేనుకూడా రత్నాలు సానబట్టటం నేర్చుకుంటాను. మన ఇద్దరమూ నా సంపాదనతో బతకలేకపోము," అన్నాడు.

తల్లి సరేనన్నది. రత్నవేది ఒక గురువు వద్ద రత్నాలు సానబట్టటం నేర్చుకుంటూ పని చెయ్యటానికి కుదిరాడు. త్వరలోనే వాడికి రత్నాలుండే రాళ్లయొక్క స్వభావాలు బాగా తెలిసిపోయాయి.

మరి రెండేళ్లు గడిచాక వాడు తన గురువుతో, "నేను మా మేనమామ ఇంటికి వెళ్లి రెండు వారాలలో తిరిగివస్తాను," అని చెప్పి సెలవు పుచ్చుకున్నాడు. తల్లితోకూడా ఆ మాటే చెప్పి వాడు తన మేనమామ గారింటికి బయలుదేరాడు. వారుండే వూరు పడమటి కొండలకు దిగువనే.

అక్కడికి చేరిన మర్నాడు ఉదయమే ఒక సంచీలో తన శానమూ, సుత్తే వేసుకుని, చద్దిఅన్నం మూట గట్టుకుని, "కొండలమీద రత్నాలు వెతుక్కొని వస్తాను," అని మేనమామతో చెప్పి బయలుదేరాడు.



"పిచ్చివెధవ! పదహారేళ్లు నిండలేదు, వీడు రత్నాలు వెతకటమేమిటి?" అని మేనమామ నవ్వుకున్నాడు.

రత్నవేది విసుగూ విరామమూ లేకుండా ఆ రోజల్లా కొండలమీద తిరిగి, తనకు రత్నాలుంటాయని తోచిన రాళ్లన్నిటినీ కొట్టి సంచీలో వేసుకున్నాడు. రోజల్లా సేకరించినా రాళ్లు సంచీ సగానికికూడా రాలేదు. అందుచేత వాడు తాను తెచ్చుకున్న అన్నంలో సగమే తిని, ఆ రాత్రి కొండలమీదే పడుకున్నాడు. మర్నాడు సాయంకాలానికి సంచీ నిండింది. ఆ రాత్రే వాడు మేనమామల ఇంటికి తిరిగివచ్చాడు.

వాడు తెచ్చిన రాళ్లన్నీ చూసి, "ఇందులో ఏమైనా రత్నాలుంటాయిట్రా?" అని అడిగాడు మేనమామ.

"కనీసం మూడువందల వరహాల విలువ గల రత్నాలుంటాయి," అన్నాడు రత్నవేది.

వాడి మేనమామ ఉన్నికంబళ్లు నేయించి ఏడాదిపొడుగునా వాటిని అమ్మినా మూడు వందల వరహాలలాభం ఉండేది కాదు. అందు చేత మేనల్లుడి మాటలకు ఆశ్చర్యపడ్డాడు.

రత్నవేది తెచ్చిన రాళ్లలో మూడువందల వరహాల విలువ చేసే రత్నాలున్నమాట అబద్ధమే గాని నూటయాభై వరహాల విలువ గల పచ్చలూ, గోమేధికాలూ, చిల్లర రత్నాలూ దొరికాయి. బీదస్థితిలో ఉన్న రత్నవేది నూరు వరహాలు తన తల్లికిచ్చి అవసరమైన ఖర్చులకు వినియోగించమన్నాడు.

తాను ఎప్పటికైనా విలువ గల వజ్రాన్ని సంపాదిస్తానన్న ధైర్యంకూడా వాడికి చిక్కింది. అందుచేత వాడు మరుసటివేడు మళ్లీ తన మేనమామగారింటికి బయలుదేరి వెళ్లాడు. ఈసారి వాడు అచ్చగా వజ్రాల కోసమే వెతకటానికి నిశ్చయించాడు. వాడు కొండలపై మూడు నాలుగు రోజులు గడపటానికి తగిన సన్నాహంతో వెళ్లి, వజ్రాలుండే రాళ్లుగా కనిపించిన వాటి నన్నిటినీ పగలగొట్టి తన గోతం నింపుకుని తిరిగివచ్చాడు.



వాడు ఆ రాళ్ల నన్నిటినీ తన గురువు ముందు పోసి, "వీటిలో ఎందులోనైనా వజ్రం ఉంటుందా? చూసి చెప్పండి," అన్నాడు.

రత్నవేది గురువు ఒక్కొక్క రాయినే పరీక్షించి తల అడ్డంగా తిప్పి ఒక మూల గిరవాటు వేశాడు. రత్నవేది నిరుత్సాహ పడలేదు. ఎందుచేతనంటే వాడికికూడా ఆ రాళ్లలో ఆటే నమ్మకం లేదు. ఒక్క రాయి గురించే వాడికి కొంచెం ఆశ ఉన్నది. ఆ రాతిని గురించి తన గురువు ఏమంటాడో తెలుసుకోవాలని వాడికి ఆత్రంగా ఉన్నది.

గురువు ఆఖరుకు ఆ రాయిని ఎత్తి దాన్ని చాలాసేపు పరీక్షించి దాన్నికూడా మూలకు విసిరివేసి, "నీ శ్రమ అంతా వృథా! ఒక్క రాతిలోనూ రత్నం లేదు!" అన్నాడు.

గురువు తనతో అబద్ధం చెప్పాడని రత్నవేదికి అనుమానం తోచింది. ఆ రాత్రి వాడు చప్పుడు చేయకుండా రాళ్లను సానబట్టే గదికి వెళ్లి, తాను తెచ్చిన రాళ్లను ప్రమిద దీపం సహాయంతో వెతికాడు. అక్కడ అన్ని రాళ్లూ ఉన్నాయిగాని గురువుగారు ఆఖరులో చూచిన రాయి లేదు. వాడి అనుమానం దృఢమయింది.

పక్కగది అలమారులో సానబట్టిన రాళ్లుంటాయి. రత్నవేది ఆ గదిలోకి వెళ్లి ఆ అలమారులో సగం సానబట్టిన వజ్రపు





రాయిని చూశాడు. మబ్బులలోనుంచి బయటికి వచ్చే చంద్రుడిలాగా ఆ రాయిలో పెద్ద వజ్రం మెరుస్తున్నది.

గురువు తనను మోసం చేశాడని రూఢి అయింది. రత్నవేది ఆ రాయిని తీసి తన జేబులో వేసుకుని, "నువు దొంగముండా కొడుకువు! నేను నీకింద పని చెయ్యను!" అని ఒక చీటీ రాసి అలమారులో పెట్టి, తన ఇంటికి వెళ్ళిపోయాడు.

పూర్తిగా సానబట్టినాక ఆ వజ్రాన్ని చూసుకుని రత్నవేది చాలా మురిసి పోయాడు. అది లక్ష వరహాల విలవ చెయ్యక పోవచ్చు గాని సులువుగా యాభైవేలు చేస్తుంది. దీనితో తన దరిద్రం శాశ్వతంగా తీరిపోతుంది. ఈ రత్నాన్ని మంచి వర్తకుడికి అమ్మి వీలయినంత సొమ్ము రాబట్టి, ఆ సొమ్ముతో ఇళ్లూ, తోటలూ, పొలాలూ కొని మహారాజులాగా బతుకుదామని రత్నవేది కలలు కన్నాడు.

కాని అంత విలవైన రత్నాన్ని అమ్మటం సులువు కాదు. తనదగ్గిర అంత విలవైన వస్తువు ఉన్నట్టు పదిమందికీ తెలియాలి. ఒకరికీ, ఇద్దరికీ చూపితే తనకు దాని పూర్తి విలవ దక్కదు. అందుచేత వాడు దాన్ని ఎవరికీ చూపక మంచి సమయంకోసం ఎదురు చూడసాగాడు.

వాడికి కావలిసిన అవకాశం కొద్ది మాసాలలోనే లభించింది. నగరంలో ఒక పెద్ద సంత జరిగింది. ఆ సంతకు నానా దేశాలనుంచీ రకరకాల సరుకులు తీసుకుని వర్తకులు వచ్చారు. వారిలో ఇరవైకి పైగా రత్నవర్తకులే ఉన్నారు. అటువంటి సంతలో తన వజ్రానికి సిసలైన ధర నిర్ణయమవు తుందని రత్నవేది నిశ్చయించుకున్నాడు.

వాడు సంతలో ప్రవేశించి రత్నవర్తకుల అంగళ్లన్నీ చూడసాగాడు. అందులో ఒక అంగడి వాణ్ణి ఆకర్షించింది. మిగిలిన అంగ ళ్లన్నిటిలోనూ కలిసి ఎన్ని రత్నాలున్నాయో

ఆ ఒక్క అంగడిలోనూ అన్ని రత్నాలున్నాయి. ఆ అంగడిలో కూర్చున్న ముసలివాడు తన రత్నాలను ఒక ఎత్తయిన కుప్పగా అమర్చాడు. కుప్ప నడినెత్తిన ఒక పెద్ద ముత్యాన్ని ఉంచాడు. రంగు రంగుల రత్నాలను శ్రేణులలో అమర్చిన ఆ కుప్ప చూడటానికి ఎంతో మనోహరంగా ఉన్నది.

రత్నవేది ఆ కుప్పను తనివితీర చూసి, ముసలివాడికేసి తిరిగి, "మీవద్ద అన్ని రత్నాలూ ఉన్నాయిగాని వజ్రాలు లేవెందు చేత? ఆ కుప్ప నడినెత్తిన ఆ ముత్యానికి బదులు అదే ప్రమాణంగల వజ్రం అమర్చితే ఎంత బాగా రాణించేది?" అన్నాడు.

"నావద్ద అన్నిరకాల రత్నాలున్నాయి, బాబూ. నువు ఏరకం రత్నమైనా, ఎంత పెద్దదైనా తీసుకురా, అంతకన్న పెద్దది నా దగ్గిర ఉందని చూపిస్తాను," అన్నాడు ముసలివాడు.

"చూపించలేరు! నాదగ్గిర ఉన్నంత వజ్రం మీదగ్గిర ఉండేటందుకు వీలులేదు!" అన్నాడు రత్నవేది.

"నీ వజ్రం విలవ ఎంతో చెప్పు, తరవాత దాన్ని బయటపెట్టు. అంతకంటె పెద్ద వజ్రాన్ని నేను చూపించగలిగితే దాన్ని నాకు ఇచ్చేసి నీదారిన పో. నేను చూపించ



లేకపోతే నీ వజ్రానికి సమమైన రత్నాలను, నీవు కోరినవాటిని నేను నీకు ఉచితంగా ఇచ్చేస్తాను," అన్నాడు ముసలివాడు.

ఆ సమయంలో అక్కడికి కొందరు రత్నవర్తకులూ, బేరగాళ్లూ వచ్చారు.

రత్నవేది అంతమంది చూస్తున్నారన్న గర్వంతో తన జేబులోనుంచి వజ్రాన్ని తీసి ముసలివాడి ఎదట ఉంచాడు. ముసలివాడు దాన్ని పరీక్షించి, "నీ మాట నిజం, నాయనా! ఈ వజ్రం యాభైవేల వరహాలకన్న ఎక్కువే విలవ చేస్తుంది. కాని నాదగ్గిర ఇంతకంటె పెద్ద వజ్రం ఉన్నది," అంటూ తన జేబులో నుంచి ఒక వజ్రాన్ని తీశాడు.

తాను పన్నెండేళ్లవాడై ఉండగా రత్న వర్తకుడివద్ద చూసిన వజ్రమే అది! రత్నవేది పందెం ఓడిపోయాడు. ముసలివాడు వాడి వజ్రాన్ని తీసుకుని, రత్నాలకుప్ప నడి నెత్తినుంచి ముత్యాన్ని తీసేసి, రత్నవేది వజ్రాన్ని దానిపై ఉంచాడు.

చుట్టూ చేరినవారు తలా ఒకవిధంగా మాట్లాడారు. "చిన్నవాణ్ణి చేసి ముసలివాడు మోసం చేశాడు," అన్నారు కొందరు. "పిచ్చి వాడు, దాన్ని ఎవరికి అమ్మినా యాభైవేల వరహాలు వచ్చేవి," అన్నారు మరికొందరు. కాని రత్నవేది ఈ మాట లేవీ చెవిన పట్టించుకోకుండా తలవంచుకుని తనదారిన తాను వెళ్లాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, రత్నవేది నిష్కారణంగా తన వజ్రాన్ని ఎందుకు పోగొట్టుకున్నాడు? అతను ముసలివాడితో పందెం వెయ్యటానికి కారణమేమిటి? పందెంలో గెలిచి ముసలివాడివద్ద యాభైవేల వరహాల విలవగల రత్నాలను ఉట్టుడియుంగా సంపాదించాలనా? లేక అమాయికత్వంచేతనా? ఈ ప్రశ్నకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

"రత్నవేది అచ్చగా అమాయకుడూ కాడు దురాశాపరుడూ కాడు. తన వజ్రానికి నికరమైన విలవ ఏమిటో పదిమందిలో నిర్ణయం కావటమూ, పదిమందికీ తెలియటమూ మాత్రమే వాడికి కావలిసింది. పందెం ఓడినా వాడి కోరిక నెరవేరింది. వజ్రం పోయినందువల్ల వాడికి కలిగిన నష్టం మాటా? కొండలలో ఇంకా వజ్రాలున్నాయి. వాటిని వెతకటం తనకు చాతనవునని వాడెరుగును. అందుచేత ఆ వజ్రం పోయినందుకు వాడు అంతగా విచారించలేదు," అన్నాడు విక్రమార్కుడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్లీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# అనుమాన పిశాచం

అమరావతీ పట్టణాన్ని ఏలే రుతుపర్ణుడూ, అలకానగరాన్ని ఏలే ధనంజయుడూ అబాల్య మిత్రులు. చిన్నతనంలో వారిద్దరూ ఒకరినొకరు ఎడబాయకుండా కలిసి ఆడుకున్నారు, కలిసి చదువుకున్నారు; ఒక కంచంలోనే తిని ఒక మంచంలోనే పడుకున్నారన్నమాట.

అయితే కొన్నాళ్లకు తమ తమ తండ్రులు చనిపోయాక వారు చీలిపోయి చెరొక దేశానికీ రాజు కావటం జరిగింది.

రుతుపర్ణుడి భార్య సౌదామిని చాలా గొప్ప అందగత్తె, మహాసాధ్వి. రుతుపర్ణుడికి ఆమెమీద అంతులేని ప్రేమ. వారికి లోహితుడని ఒక కుమారుడు కూడా ఉన్నాడు. అనుకూలవతి అయిన భార్యతోనూ, ఎదిగివచ్చే కొడుకుతోనూ సుఖంగా కాపరం చేస్తున్న రుతుపర్ణుడికి ఏ లోటూ లేదు; తన బాల్యమిత్రుడైన ధనంజయుణ్ణి చాలా కాలంగా చూడలేదన్నది మాత్రమే ఆయనను తీవ్రంగా బాధపెట్టుతూ వచ్చింది. ఆ లోటుకూడా తీర్చుకునే ఉద్దేశంతో ఆయన ధనంజయుణ్ణి ఒకసారి వచ్చి తన ఇంట కొద్ది మాసా లుండిపొమ్మని కబురుమీద కబురు చేస్తూవచ్చాడు.

చిట్టచివరకు ఒకనాడు ధనంజయుడు అమరావతికి రానేవచ్చాడు. బాల్యమిత్రులిద్దరూ చాలా కాలానికి తిరిగి కలుసుకున్నారు. ఇప్పుడు రుతుపర్ణుడి ఆనందం కట్టలు తెగి ప్రవహించింది. తమ అతిథి అయిన ధనంజయుడిపట్ల తన భర్తకు గల అపారమైన అభిమానాన్ని గుర్తించి, సౌదామినికూడా రుతుపర్ణుడికి తీసిపోకుండా అతిథి మర్యాదలు జరిపింది.

కొన్ని వారాలు అతిథిసత్కారాలు పొందిన పిమ్మట ధనంజయుడు తన మిత్రుడితో వెళ్లివస్తానని చెప్పాడు.

ఆర్. కోదండరామయ్య



"అప్పుడే వెళ్లటమేమిటి? నువు వచ్చి రెండు రోజులైనా అయినట్టు లేదు. ఇంకా నాలుగైదు వారాలుండి పోదువుగానిలే!" అన్నాడు రుతుపర్ణుడు.

"అలా కాదు. అంతగా అయితే మరొక సారి వస్తాను," అన్నాడు ధనంజయుడు.

రుతుపర్ణుడికి చాలా కష్టంవేసింది. ఆయన సౌదామినితో, "మన అతిథి అప్పుడే వెళ్లిపోతానంటున్నాడు. ఇది నాకేమీ బాగా లేదు. నేనెంత చెప్పినా వినకుండా ఉన్నాడు. నువ్వయినా అడిగి చూడు!" అన్నాడు.

భర్త ఆదుర్దా గ్రహించి సౌదామిని ధనంజయుడితో, "మీరు అప్పుడే తిరిగి వెళ్లటానికి నిశ్చయించుకున్నారట. మీరు వెళ్లిపోతే మాకు పెన్నిధి పోయినట్టుంటుంది. మీరు మరో నాలుగు అయిదు వారాలు మాతో గడపగలిగితే పెద్ద వరం పొందినట్టుగా నేనూ, నా భర్తా సంతోషిస్తాం. మా మనసులు కష్టపెట్టి వెళ్లటం ఏమైనా భావ్యమా, చెప్పండి!" అన్నది.

ధనంజయుడు తన స్నేహితుడి మాట తీసివేసినంత తేలికగా సౌదామిని మాట తీసివెయ్యటానికి మొహమాటపడ్డాడు; ఆవిడ అంత ఆప్యాయంగా అడుగుతూంటే ఉండిపోకపోవటం చాలా అనాగరికంగా ఉంటుందని తోచి ఉండిపోవటానికి సమ్మతించాడు.

అంతదాకా నిర్మలంగా ఉన్న రుతుపర్ణుడి మనసులో ఇప్పుడు అనుమాన పిశాచి ప్రవేశించింది; తన భార్యా తన మిత్రుడూ ఒకరినొకరు ప్రేమించుకుంటున్నారనీ, అందుకే ఆమె కోరగానే తన మిత్రుడు మారుమాటాడక ఇక్కడ ఉండిపోయాడనీ అనుకున్నాడు.

ఒకసారి అనుమాన పిశాచం బుర్రలో ప్రవేశించినాక అది మనిషిని వెర్రివాణ్ణి చేస్తుంది. రుతుపర్ణుడి అనుమానపు కళ్లకు అంతా అనుమానాస్పదంగానే కనబడింది.



అనుమానం అనేది అతని హృదయాన్ని అతి త్వరలోనే కార్చిచ్చులాగా దహించి వేయసాగింది.

ఈ మంటను భరించలేక రుతుపర్ణుడు సుదేష్ణుడనే తన అంతరంగికుణ్ణి పిలిచి, "నా సంసారానికి చిచ్చు పెట్టిన ఆ దుర్మార్గుడు ధనంజయుడికి విషం పెట్టి చంపెయ్యి. ఇది నా ఆజ్ఞ!" అన్నాడు.

సుదేష్ణుడికి అంతా అర్థమయింది. సౌదామిని మహా పతివ్రత అనీ, ధనంజయుడు ధర్మమూర్తి అనీ అతనికి తెలుసు. అందుచేత అతను ధనంజయుడికి సంగతంతా చెప్పేసి, "మహారాజా, మీరు ఈ దేశంలో నిలవటం క్షేమంకాదు. వెంటనే మీ దేశానికి బయలుదేరండి. మీ ప్రాణం కాపాడాను గనక, నా ప్రాణాన్ని మీరు కాపాడండి; నన్ను కూడా మీ వెంట మీ రాజ్యానికి తీసుకుపొండి!" అన్నాడు.

ఆ రాత్రే ధనంజయుడు ఎవరితోనూ చెప్పకుండా సుదేష్ణుణ్ణి తనవెంట పెట్టుకుని అలకానగరానికి వెళ్లిపోయాడు.

ధనంజయుడు పారిపోవటంతో రుతుపర్ణుడి అనుమానాలన్నీ రుజువయినట్టయింది. అయన నిండు చూలాలుగా ఉన్న సౌదామినిని ఖైదులో పెట్టించాడు. తన తల్లి



దండ్రుల మధ్య ఆకస్మికంగా ఏర్పడిన ఈ శత్రుత్వం చూసి సుకుమారహృదయుడైన లోహితుడు మనోవ్యాధితో మంచంపట్టాడు.

ఖైదులోనే సౌదామిని ఆడపిల్లను కన్నది. రుతుపర్ణుడి అంతరంగికులలో మరొకడైన సౌబలుడనేవాడి భార్య శీలవతి రాణికి పురుడుపోసింది. ఆమెకు సౌదామిని నిర్దోషి అన్న పూర్తి విశ్వాసం ఉన్నది.

"రాజుగారికి రానురాను మతిపోతున్నది. ఈ బిడ్డను చూసిఅయినా ఆయనకు వివేకం కలుగుతుందేమో! ఆ బిడ్డను నాకివ్వండి. నేను తీసుకుపోయి రాజుగారికి చూపిస్తాను!" అని శీలవతి సౌదామినితో అన్నది.



సౌదామిని ఆ బిడ్డకు మంచి ఉడుపులు వేయించి, వెలలేని నగలు పెట్టించి రాజు వద్దకు పంపింది. శీలవతి ఆ బిడ్డను తీసుకు పోయి, అందరిమధ్యా కూచుని రాచ కార్యంలో నిమగ్నుడైఉన్న రుతుపర్ణుడి పాదాలవద్ద పెట్టి, అడగవలిసిన మాటలన్నీ నిర్భయంగా అడిగేసింది.

రుతుపర్ణుడు పశ్చాత్తాపపడక పోగా మరింత రెచ్చిపోయి, "నీ భార్యను బయటికి గెంటు!" అని సౌబలుణ్ణి ఆజ్ఞాపించాడు. తరవాత ఆయన సౌబలుడితో, "అలాటిదానికి పుట్టిన ఈబిడ్డ నాకెందుకు? దీన్ని తీసుకుని పడవలో వెళ్లి ఏలంకలోనో విడిచిపెట్టి తిరిగి రా. దాని చావు అదే చస్తుంది!" అన్నాడు.

సౌబలుడు సుదేష్ణుడివంటివాడు కాడు. రాజాజ్ఞలో గల న్యాయాన్యాయాలను ఏమాత్రమూ విచారించక, రాజకుమార్తెను తీసుకుని పడవలో సముద్రంమీద బయలుదేరాడు. మధ్యమార్గంలో తుఫాను వచ్చి ఆ పడవ కొన్నాళ్లకు ఒక తీరం చేరింది. అది అలకానగరప్రాంతపు తీరం.

సౌబలుడు ఆ బిడ్డతో సహా తీరంమీదికి వెళ్లి కొంతదూరాన ఆ బిడ్డను ఉంచి, పక్కనే ఆమె దుస్తులు పెట్టి తిరుగు ప్రయాణంమీద బయలుదేరాడు. అతను



తీరంకేసి పోయే దారిలో ఒక ఎలుగుగొడ్డు అతడి పైబడి చీల్చి చంపేసింది.

మందకుడనే గొర్రెలను కాచుకునేవాడు కొంతదూరంనుంచి ఈ సంఘటన చూశాడు. ఎలుగుగొడ్డు వెళ్ళిపోగానే వాడు సొబలుణ్ణి సమీపించి అతని ప్రాణంపోయిందని తెలుసుకున్నాడు. వాడు అక్కణ్ణుంచి కదిలి కొద్దిక్షణాలలో చంటిబిడ్డ వద్దకు వచ్చాడు. ఆ బిడ్డను చూడగానే వాడికి ప్రాణాలు లేచివచ్చినట్టయింది. ఎందుకంటే ఆ బిడ్డ గొప్పఇంటి బిడ్డ అని స్పష్టమవుతున్నది. ఆమె వంటిమీద ఎంతో విలువగల నగలున్నాయి, దుస్తులుకూడా ఉన్నాయి.

మందకుడు ఆరాత్రి బిడ్డతో తన ఇల్లు చేరాడు. వాడు తన భార్యతో, "మనకు బిడ్డలు లేరని తెలిసి భగవంతుడు మన లోటు తీర్చాడు. బిడ్డతోబాటు మన దరిద్రం కూడా తీరింది. ఈ బిడ్డ ఒంటిమీద ఉన్న ఒక్క నగ అమ్మితే మనం బతికున్నన్నాళ్లూ సుఖంగా ఉండవచ్చు," అన్నాడు.

తెల్లవారేలోపుగా మందకుడూ, వాడి భార్యా ఆ శిశువుతోసహా దూరగ్రామానికి వెళ్ళిపోయారు. "ఈ పిల్ల ఎవరు? ఈ డబ్బంతా మీకెక్కడిది?" అని ఇంకో గ్రామంవారైతే అడగరు. అక్కడ వారు ఆ శిశువు తమదేనని చెప్పుకుని, దానికి చంద్రిక







అని పేరుపెట్టుకుని, ఆ పిల్లతాలూకు దుస్తులూ, సగం నగలూ దాచిపెట్టి, మిగిలిన నగలు అమ్మి ఆ డబ్బుతో సుఖంగా జీవనం చేయసాగారు.

అక్కడ అమరావతీ పట్టణంలో రుతుపర్ణుడు ఒకనాడు తన భార్య విచారణ ఆరంభించాడు. ఆ విచారణకన్న పరువు తక్కువ విషయం ఏదీ ఉండబోదని ప్రజలందరూ అనుకున్నారు.

విచారణ ప్రారంభించిన కొద్దిసేపటికల్లా న్యాయస్థానంలో ఒక అశరీరవాణి ఇలా పలికింది: "సౌదామిని నిర్దోషి, ధనంజయుడు ఉదారుడు. సుదేష్ణుడు స్వామిభక్తి పరాయణుడు. రుతుపర్ణుడు అను మానవపిశాచం వాత పడి కర్కోటకుడయాడు. ఆయన పోగొట్టుకున్నది మళ్ళీ దొరకకపోతే ఆయనకు వారసులుండరు!"

ఈ మాటలకు సభలోవారంతా నివ్వెరపోయారు, కాని రుతుపర్ణుడు వాటిని లక్ష్యపెట్టలేదు. "ఈ అశరీరవాణి పచ్చిమోసం; నా భార్యకు శిక్షపడకుండా ఆమె ఆప్తులెవరో తంత్రం పన్ని ఉంటారు. లోహితుడుండగా నాకు వారసులు లేక ఎందుకు పోతారు. నేను పోగొట్టుకున్నది కొత్తగా పుట్టిన బిడ్డనేకదా!" అని ఆయన అనుకున్నాడు.

అంతలోనే నౌకర్లు వచ్చి, "మహారాజా, తన తల్లి విచారణ జరుగుతున్నదని తెలియగానే, జబ్బుతో ఉన్న లోహితుడి గుండె ఆగిపోయి చనిపోయాడు!" అని చెప్పారు. తన కుమారుడి మరణవార్త విని సౌదామిని మొదలు నరికిన చెట్టులాగా కూలి పడిపోయింది. శీలవతి ఆమెను దాసీలచేత మోయించుకుని తన ఇంటికి తీసుకుపోయి ఉపచారాలు చేయించింది.

సౌదామిని విచారణ అంతటితో అయిపోయింది. తన ఏకపుత్రుడు చావటమూ, సౌదామిని ఆ వార్త విని మూర్ఛపోవటమూ చూడగానే రుతుపర్ణుడికి తన భార్య పాతి





వ్రత్యంలో నమ్మకం కుదిరింది. అశరీరవాణి మాటలు నిజమయాయి. సౌబలుడు తీసుకు పోయిన తన కుమార్తె తిరిగి దొరకకపోతే తనకు నిజంగానే వారసులు లేరు. ఆ సంగతి చెప్పిన అశరీరవాణే సౌదామిని నిర్దోషి అని కూడా చెప్పిందాయె!

"జరిగినదానికి సౌదామిని కాళ్లపై పడి క్షమాపణ వేడుకుంటాను. సౌబలుడు తిరిగి రాగానే నా కుమార్తె కోసం మళ్లీ పంపు తాను!" అనుకున్నాడు ఋతుపర్ణుడు. ఈ రెండూ అడియాసలే అయాయి. ఎందు కంటే, సభలో మూర్ఛపోయిన సౌదామిని ఆ మూర్ఛలోనే ప్రాణాలు విడిచిందని శీలవతి రాజుకు అబద్ధపువార్త పంపింది; సౌబలుడు తిరిగి రానేలేదు.

అనేక సంవత్సరాలు గడిచాయి. అలకా నగరానికి సమీపంలో చంద్రిక గొల్లల ఇంట పెరిగి పెద్దదయింది. ఆమె మామూలు గొల్ల పిల్లలాగే దుస్తులు ధరించి తమ ఇంటికి సమీపంలో ఉండే బీళ్లలో తన పెంపుడి తండ్రి గొర్రెలను మేపుకుంటూ ఉండేది. భూమిమీద పడిననాటినుండీ గొల్లల ఇంటనే పెరిగినప్పటికీ ఆమెలో ఉత్తమ వంశలక్షణాలు పోనేలేదు. ఆమె సౌందర్యం అపూర్వంగా ఉండేది.



ఒకనాడు ధనంజయుడి కుమారుడు చంద్రకేతుడనేవాడు తన మిత్రులతో వేటకు పోతూ, దారిలో గొర్రెలను కాస్తున్న చంద్రికను చూసి సమ్మోహితుడై ఆమెను పలకరించాడు. ఆమెతో రెండు మాటలు మాట్లాడే సరికల్లా అతనికి ఆమెపై ప్రేమ పుట్టుకొచ్చింది. అది మొదలు చంద్రకేతుడు రోజూ ఆమె ఇంటికి పోతూ మందకుడితోకూడా స్నేహం చేసుకున్నాడు. అయితే తాను రాజకుమారుడనని అతను వారెవరితోనూ చెప్పలేదు; చెబితే చంద్రికగాని, ఆమె తల్లిదండ్రులుగాని తనను ఆప్తుడిలాగా చూడరని అతనికి తెలుసు.

అయితే చంద్రకేతుడి రహస్యం అతని తండ్రి అయిన ధనంజయుడికి తెలిసిపోయింది. తన కుమారుడు సభకు హాజరు గాక రోజూ ఎక్కడికో పోతూ ఉండటం గమనించి ఆయన తన నౌకర్లను అతని వెనకనే వెళ్లమని ఆజ్ఞాపించాడు. వారు తిరిగివచ్చి, రాజకుమారుడు మందకుడనే గొర్రెల కాపరి ఇంటికి వెళ్లి వస్తున్నాడనీ, ఆ గొర్రెలకాపరి కుమార్తె చక్కనిచుక్క అనీ చెప్పారు.

ఆ సమయంలోనే గొల్లల ఉత్సవం ఒకటి వచ్చింది. ఆ ఉత్సవంనాడు గొర్రెల ఉన్ని కత్తిరించి సంబరం జరుపుతారు, వచ్చిన వారందరికీ భోజనం పెడతారు. ఈ ఉత్సవానికి చంద్రకేతుడుకూడా వెళ్లాడు. అతనికి కొంచెం వెనకగా కాపుల దుస్తులు ధరించి ధనంజయుడూ, సుదేష్ణుడూకూడా వెళ్లారు. వారు ధరించిన పెద్దపెద్ద తలపాగాలూ, పెట్టుడుగడ్డాలూ చూసి చంద్రకేతుడు గుర్తించలేకపోయాడు.

ధనంజయుడు మందకుణ్ణి సమీపించి, "ఆ అందమైన పిల్ల ఎవరు? ఆమెతో మాట్లాడే అబ్బాయి ఎవరు?" అని అడిగాడు.

"అయ్యా, అది నా పిల్ల చంద్రిక. ఆ అబ్బాయి దాన్ని పెళ్లాడతానంటాడు. పెళ్లాడితే అదృష్టవంతుడే. ఎందుకంటే మాపిల్ల బొత్తిగా పేదదికాదు. దానిపేర



గొప్ప నగలూ నాణాలూ ఉన్నాయి," అన్నాడు మందకుడు. ఆ నగలు చంద్రికకు తల్లి పెట్టినవే.

ధనంజయుడు తన కొడుకును సమీపించి, "అబ్బాయీ, సంబరంకూడా చూడకుండా ఆ పిల్లతో అదే పనిగా మాట్లాడుతున్నావే. అంత అపేక్ష గలవాడివైతే చేతికి గాజులైనా కొనిపెట్టవేం?" అన్నాడు.

దానికి చంద్రకేతుడు, "అయ్యా, ఈపిల్ల గాజులకోసం మురిసేదికాదు. ఆమెకు అన్నింటికన్నా విలవైన నా హృదయమే ఇస్తాను. మేం త్వరలోనే పెళ్లాడబో తున్నాం!" అన్నాడు.

ధనంజయుడికి పట్టరాని ఆగ్రహం వచ్చింది. ఆయన తన తలపాగా, పెట్టుడు గడ్డాలూ తీసేస్తూ, "నీచుడా, ఆ పిల్లను పెళ్లాడతావా? లేక విడాకులిస్తావా? ఇంకొక సారి ఈ చాయలకు వచ్చావంటే నిన్నూ, ఈ పిల్లనూ, ఈమె తల్లి దండ్రులనూ కఠినంగా శిక్షిస్తాను. యువరాజువై ఉండి గొర్రెలు కాచుకునేదాన్ని పెళ్లాడతావా?" అని గద్దించాడు. తరవాత ఆయన సుదేష్ణుడి కేసి తిరిగి, "వీణ్ణి పెందలాడే ఇంటికి చేర్చు!" అంటూ చరచరా వెళ్లిపోయాడు.

ఆయన రాజుగారనీ, చంద్రకేతుడు యువరాజనీ తెలియగానే అందరి ఆనం







దమూ ఇగిరిపోయింది. ఎవరూ ఏమీ అనలేక పోయారు. చంద్రికమటుకు, "ఆయన ఆగకుండా వెళ్లిపోయారు! ఉంటే అడిగిఉండే దాన్ని—మేము గొల్లలమని ఆయన అంత చులకన చేయనవసరంలేదు! ఆయన ఇంటిపైన పడే ఎండే, మా యింటిపైనా పడుతున్నది! గుణం ప్రధానం గాని కులం కాదు!...అయ్యా, మీరు యువరాజుగారని తెలియక స్నేహం చేశాను. మీకూ మాకూ పొత్తు ఎలా కుదురుతుంది? మీదారిన మీరు వెళ్లండి!" అన్నది చంద్రకేతుడితో.

"చంద్రికా, మా తండ్రి అగ్రహించిన మాత్రాన నిన్ను విడిచిపుచ్చుతానను కున్నావా? గొల్లపిల్లవైతే అయావు, నేను తప్పక నిన్నే పెళ్లాడి తీరుతాను!" అన్నాడు చంద్రకేతుడు.

అతను అన్నాడేగాని, అది సాధ్యమయే పని కాదు. అందుచేత వివేకవంతుడైన సుదేష్ణుడు ఒక ఆలోచన చేశాడు. చంద్రికనూ, ఆమె తల్లిదండ్రులనూ, చంద్రకేతుణ్ణీ వెంటబెట్టుకుని అమరావతికి పోదామనుకున్నాడు. అక్కడ చంద్రికా చంద్రకేతులు సుఖంగా పెళ్లాడవచ్చు. అదీగాక తన రాజును మళ్లీ చూడాలన్న కోరిక సుదేష్ణుణ్ణి చాలారోజులుగా బాధిస్తున్నది; ఆయన చాలాఏళ్లనుంచీ పశ్చాత్తాపంలో మునిగి తేలుతున్నట్టు విన్నాడు.

సుదేష్ణుడి ఆలోచనప్రకారం అందరూ బయలుదేరి అమరావతికి వెళ్లారు. మందకుడు చంద్రికయొక్క చిన్ననాటి నగలనూ, దుస్తులనూ వెంట తెచ్చాడు. వీటినిబట్టి రుతుపర్ణుడు చంద్రిక తన కుమార్తేనని గుర్తించాడు. పోయిందనుకున్న తన కూతురు ఇన్నేళ్లకు దైవికంగా దొరికింది; తన మేలు కోరి తన బాల్యమిత్రుణ్ణి చంపక రక్షించిన సుదేష్ణుడు మళ్లీ తనవద్దకు తిరిగి వచ్చాడు. ఆయనకు ఇప్పుడు మిగిలిన చింత ఏమిటంటే, సాదామిని బతికిఉంటే



తన ఆనందానికి ఏలాంటి లోటూ ఉండక పోనుగదా అని.

ఋతుపర్ణుడు అదేపనిగా తన భార్యను తలుచుకుని కంటనీరు పెట్టుకుంటూ ఉండటం గమనించి శీలవతి, "మహా రాజా, పోయినవారు తిరిగి రారు. కాని ఈ మధ్యను ఒక అపూర్వమైన శిల్పి వస్తే ఆయనచేత సౌదామినీదేవి ప్రతిమ చేయించి, వాస్తవంగా ఉండేలాగా రంగులు వేయించాను. దాన్ని చూడగోరినట్టయితే సపరివారంగా మాఇంటికి దయచెయ్యండి!" అన్నది. అందరూ కలిసి శీలవతి ఇంటికి వెళ్లి ఆసనాలలో కూచున్నారు. శీలవతి ఒక తెర తొలగించి సౌదామినిని వారికి చూపింది. ఆ నిలబడినది నిజంగా ప్రతిమే అనుకుని అందరూ ఆ ప్రతిమను అంత వాస్తవంగా తయారుచేసిన శిల్పిని మెచ్చుకున్నారు.

"సౌదామిని ఎదురుగా నిలబడ్డట్టే ఉంది. కాని చనిపోయేనాటికి ఇంత వయసులేదే!" అన్నాడు ఋతుపర్ణుడు.

"ఆమె బతికిఉంటే ఇప్పుడు ఎలా ఉండేదో ఊహించి ఆ శిల్పి ఈ ప్రతిమను తయారుచేశాడు!" అన్నది శీలవతి.

"ఆ ప్రతిమ ఊపిరి తీస్తున్నట్టు నాకు తోస్తున్నది! శీలవతీ, నీకు పుణ్యం ఉంటుంది, ఒక్కసారి ఆ సౌదామినిని



తాకనియ్యి!" అని రుతుపర్ణుడు ఆమెను బతిమాలాడు.

మోసం ఎంతోసేపు దాగదని గ్రహించి శీలవతి, "మహారాజా, నేనొక మంత్రం చదివితే ఆ ప్రతిమ దిగివచ్చి మనతో మాట్లాడుతుంది," అన్నది.

ఆమె ఆమాట అనగానే సౌదామిని తెర వెనకనుంచి నడిచివచ్చి తన భర్తనూ, ఇంత కాలమూ తాను చూడని కుమార్తెనూ కౌగలించుకున్నది.

అందరికంటా ఆనందబాష్పాలూ, అశ్రువులూ కలిసి రాలాయి.

"మీరు చేసిన అన్యాయానికి ప్రాయశ్చిత్తంగా ఈమెను ఇంతకాలమూ నా ఇంట దాచాను. నన్ను క్షమించండి!" అన్నది శీలవతి రాజుతో.

"నాకీ శిక్ష తగినదే! ఇంకా నా తప్పు పూర్తిగా పరిహారం కాలేదు. ధనంజయుడు వస్తే ఎంత బాగుండును! అతనికికూడా క్షమాపణ చెప్పుకుంటాను!" అన్నాడు రుతుపర్ణుడు.

ఇంకా ఆయన మాట పూర్తి కాకుండనే ధనంజయుడు అక్కడికి వచ్చాడు. జరిగిన దేమిటంటే, తన కుమారుడితో సుదేష్ణుడు ఎంతకూ తిరిగిరాకపోవటం చూసి ఆయన వాకబు చేయగా, అందరూ కలిసి దేశం విడిచిపోయినట్టు తెలిసింది. వారు అమరావతి చేరిఉంటారని ఊహించి ధనంజయుడు నేరుగా అక్కడికి వచ్చిచేరాడు.

చంద్రిక రుతుపర్ణుడి కూతురేనని తెలియగానే తన కుమారుడు ఆమెను పెళ్లాడటానికి ధనంజయుడు సంతోషంతో అంగీకరించాడు. రుతుపర్ణుడిపైన ఆయనకు గల కోపం అప్పుడే పోయింది, అందుచేత తన మిత్రుడు చెప్పుకునే క్షమాపణలను ఆయన నిరుత్సాహపరిచాడు.

తరవాత చంద్రికకూ చంద్రకేతుడికీ వైభవంగా వివాహం జరిగింది.





# బుద్ధిప్రకాశం

నక్క :

భయపడబోకోయి - బంగారుమామ
దయసేయు నేను నీ-దగ్గఱనుందు
చాకలి చాకిరీ - చాలించి వచ్చి
నాకడనేయుండు - నాల్గు గాడిదలు.
అవి యాడువగుట వ-యస్సుతోనుంట
ధవునికై వెదకగా - తవిలితి వీవు.

ఆ మాట నిజమని - అది విశ్వసించి
ఆ మాయనక్కతో - నరిగె వనమ్ము.
చరచర సింహమ్ము - చాయకేగగనె
పరుగెత్తె వెనుకకు - పాపమా ఖరము.
'ఇంతగా తిరిగి నే - నెటొ దీని తేగ
చెంతకు వచ్చిన - చే విడిచితివి'
అని నక్క సింహమ్ము - నదిలింప "పరుగు
గొనెనది నాకాలు - కుంటియైపోయె"
అని సింహ మన 'సరే - అయినదియయ్యె
చని కొనివత్తు నీ-సారి పో నీకు'
అని చెప్పి నక్క చ-య్యన చేరె ఖరము
చనవున నిట్లనె : - "సాగిరమ్మోయి.
వనముననున్న ప-చ్చనిగడ్డి మేసి
కన భయంకరమయ్యె - గాడిదే అదియు
నీకోసమై ఏడ్చు - నేనేమిసేతు
అకెకు పతినీవె - అదరక రమ్ము"
గాడిద ఆ మాట - కావచ్చునంచు
ఆడది దొరకు నం - చాశతో నడిచె
ఈ సారి సింహ మొ-కే దెబ్బ జంపె.
నే సంధ్యవార్చి రా-నేవత్తు నిలుము
అని పోవ, నక్క వెం-టనె దాని మెదడు
తనివి తీరగతిని - తప్పాకయుండె.
'ఇది యేమి మెదడు లే - దిందులో' నంచు
అది వచ్చియన్న ఔ-నౌనని నక్క
"మెదడున్న నెటువచ్చు - మిత్తి దగ్గఱకు
అది లేకనే తిరు-గావచ్చె" ననియె.

కోతి :

కావున నే రాను - గాడిదవోలె
నీవెన్క, చావెఱిం-గియు తెల్విమాలి.

విద్వాన్ విశ్వం



సత్యమాడెదనని - చవటయై యొకడు
సత్యము పాడైన - చరితము వినవె?

మొసలి :

అది యేమి కథ చెప్పు - మన్న ఆలింతు

కోతి చెప్పిన కథ :

అది ఒక్క కథ; వింతు - నాలించి వినుము

* * *

కలడొక్క కుమ్మరి - తలలేనివాడు
పలుత్రాగుడున నొక్క-పరి మేను మఱచి
పగిలిన కుండపై - పడిపోయినాడు
తగిలెను నుదుటిపై - పగిలినబొచ్చె.
దాని లెక్కింప కా-తడు తిరుగాడ
మానక పుండయ్యె, - మందుమాకులను
చాలనాళ్ళకు పుండు - సమసెనేగాని



పోలేదు కనుమ ఏ - కాలానగూడ.
ఒకపరి కఱవుతో - నోడి, వాడరిగె
వికలుడై వేఱొక - విషయమ్ముగూర్చి
అటరాజు కొల్వున - నతగాడు కుదిరె
పటువీరుడని రాజు - భ్రమసెను; వీని
నుదుట నింతటి గాయ - మదియేలవచ్చు
ఎదిరినోర్చెడు వీరు - డితడని నమ్మె.
రాకుమారులలోన - రాజున కితడు
ఏ కార్యమునగూడ - నిష్టుడేయయ్యె.
ఇటులుండ శత్రురా - జిటువచ్చు ననిరి
దిటవుగా సైన్యమ్ము - తీర్చెనంచనిరి.
అంత నా రాజు ర-మ్మని వీని ననియె

రాజు :

ఎంతటి వాడవో - యెవరవో తెలుపు
యుద్ధసన్నద్ధమౌ-చుండె నా సేన
యోద్ధవుగా తెల్పు-నోయి నీ కనుమ

కుమ్మరి :

ఒకసారి తాగి ఏ - నొక కుండమీద
వికలుడనై పడ - వెలసె నీ కనుమ
పవరమ్ములో గాయ-పడలేదు, భూమి
ధవుడను కాను భూ-ధవ! కులాలుడను.

రాజు :

మోసపోయితి రాజ-పుత్రుడ వంచు
మోసపోయితి వీర-మూర్తి వటంచు
కుమ్మరివని రాచ-కుల మెఱుంగకయె
పామ్మెటకైన త-ప్పును పరాభవము.





కుమ్మరి :

అటులందురేల మ-హారాజ మీరు

రాజు :

తటుకున బొమ్మ, క-థ విన లేదె.

రాజు చెప్పిన కథ :

వని నొక సింహ దం-పతులున్నవారు
చనె పతి వేటకు - సాయంత్రమయ్యె.
ఒక మృగమ్మేగాని - ఒక శశమ్మేని
ఒకట కన్పడదయ్యె - ఒకచోటమటుకు
నక్కపిల్లొకటి క-న్పడ చంపలేక
చిక్కిన దిదియని - చెచ్చెఱ వచ్చె.
సతికివ్వ నా మెయు - చంపంగలేక
మతిసంతుగా నెంచి - మరులుతో సాకె.
తన పిల్లలును నది - తన యింట బెరిగె
వని నొకసారి మూ-డును విహరింప
ఏనుగపిల్ల నెం-తే జూచి సింహ
మానిత శిశువులు - మఱి చెలరేగె
ఇంత ఏనుగు మీది - కెగబడుటేల
చెంతకు నే రాను - చెడిపోదు రనుచు
నక్కపిల్లేమొ వె-న్కకు పరువెత్తె
తిక్క దటంచవి - తెగ నవ్విపోయె.
ఇది విని సింహిక :-" ఇక నిల్వ కిచట
అదనున నీజాతి - అది వెలువడియె.
పిల్లలతోపాటు - పెరిగితేకాని
అల్లంత సింహ గు-ణావళిరాదు.
అవి నక్కవని తెలి-యగలేని యపుడె
దవుదవ్వులకు పొమ్ము - తప్పక " ననియె



కోతి :

అని రాజు కుమ్మరి - కా కథ చెప్పి
చనుమనె—అ కుమ్మ-రిని కాన నేను
నిజము చెప్పగబోయి - నీ వాతబడను
అజపజ లేకుండ - నరుగుదు నింక.

మొసలి :

అయ్యయ్యొ అట్లందు - వదియేమి నీతి ?
నెయ్యుడ నామాట - నిరసింపదగునె ?

కోతి :

అడుదానికి వశు-డైపోయినావు
ఓడిపోయితి విట్లు - యుక్తిలో నాకు
నీ నోటిదురదతో-నే కనుగొంటి
లోని దుర్బుద్ధులు - లొంగను నీకు.
మునుపొక్క చాకలి - తన గాడిదకును





ఘనముగా పులితోలు - కప్పి పొలాల
రేయిప్రొద్దుల తోలి - హాయిగానుండు
అయది తృప్తిగా - అట మేయుచుండు.
పులియను బెదరున - పొలము కాపులును
కలబడి అదిలింప - కలగుండు వడిరి.
ఒకపరి గాడిద - ఓండ్ర పెట్టగనె
నకిలీపులియు వాయి - నటువీడి అఱచె
అంతట కాపు లి-య్యది గాడ్దె యనుచు
పంతాన చంపిరి - పాపమం చనక.

*　　*　　*

అని యిట్లు వారు మా-టాడుచునుండ
చనిపోయె నీ భార్య - యని వార్త వచ్చె



మొసలి రాలేదని - పాలతియు తిండి
మెసవక చచ్చెను - మొసలియు నేడ్చె.

కోతి :

నీ వింతగా నేడ్వ - నేమి కారణము
అవిడ రాకసి - అడుగంటె చాలు.

మొసలి :

పోయెను భార్య నీ-వును నమ్మవైతి
ఈ యవస్థను బాప - నెవరింక గలరు ?

*　　*　　*

అనుచున్నయంతలో - అట ఒక చేప
కనివచ్చి నీ యింట - కాలూనె నొకడు
అని మకరమ్ముతో - నన పాప మదియు
తన భార్య, తన యిల్లు, - తన మైత్రి చెడగ
లబలబ మంచు చ-ల్లగ కోతి జీరి
అబలుడ కర్తవ్య - మది చెప్పుమనియె.

కోతి :

సతి మాటవిని నన్ను - చంప జూచితివి
సతికయి మిత్రుని - చంపుట తగునె.
తన కాపులగు వారు - తగవును చెప్ప
విననట్టి వాడెప్డు - వికలుడై తీరు.

మొసలి :

అది యెట్లు వినిపింపు - మన్న నే విందు

కోతి :

మది నుంచి విను కథ - మంచిది వింతు.






# [2]

సిద్ధార్థుడు అయిదు నెలల బిడ్డ అయి ఉండగా పొలాలుదున్నే ఉత్సవం వచ్చింది. మొదటి రోజున ఆబాలగోపాలమూ పొలాలకి వెళతారు. మొట్టమొదటగా రాజుగారు బంగారు నాగలితో తూర్పునుంచి పడమరకు ఒక చాలు దున్నుతాడు. ఆయన కాడికి కట్టిన ఎద్దుల కొమ్ములకు బంగారు తొడుగులుంటాయి. రాజుగారు మేడిని ఎడమచేత పట్టుకుని, కుడిచేతిలో బంగారు ములుగర్ర పట్టుకుని దున్నుతాడు.

రాజుగారు ఒక చాలు దున్నినాక కుల పెద్దలు నూటఎనిమిది వెండి నాగళ్లతో మూడు చాళ్లు దున్నుతారు. వారి నాగళ్లకు కట్టిన ఎద్దుల కొమ్ములకు వెండి తొడుగులూ, వారి చేతులలో వెండి ములుగర్రలూ ఉంటాయి.

నాలుగు చాళ్లూ పూర్తి అయాక మామూలు రైతులు వెయ్యి నాగళ్లతో పొలాలన్నీ దున్నేస్తారు. ఈ దున్నటంలో వారు పోటీలు పడతారు. ఎవరి చాలు సూటిగా ఉంటే, ఎవరు ఎక్కువ చాళ్లు దున్నితే వాళ్లు సమర్థులు!

ఈ ఉత్సవానికి కపిలవస్తు పౌరులు తమకు గల మంచిబట్టలు ధరించి, బంగారు, వెండి జెండాలు చేతబట్టి, విసనకర్రలూ, బిందెలూ, తట్టలూ వెంటబెట్టుకుని వచ్చారు. రాజకుటుంబమంతా ఉత్సవం చూడరావటంవల్ల నూరుమంది దాదులతో



సహా సిద్ధార్థుణ్ణికూడా తెచ్చారు. ఒక కడిమి చెట్టు నీడలో చుట్టూ తెరలు కట్టి వాటి మధ్యను పిల్లవాడి తొట్టి ఉంచారు. తరవాత దాదీలందరూ ఉత్సవం చూడబోయి ఆ ఆనందంలో పిల్లవాడి మాటే పూర్తిగా మరిచిపోయారు.

తిరిగి పొద్దు వాలేదాకా వారికి పిల్లవాడి మాటే జ్ఞాపకం రాలేదు. జ్ఞాపకం వచ్చిన వెంటనే వారు కడిమిచెట్టు వద్దకు పరిగెత్తి అక్కడ ఒక అద్భుతం చూశారట. అదేమిటంటే, అన్ని చెట్ల నీడలూ తూర్పుకు వాలిపోయినప్పటికీ కడిమిచెట్టు నీడ సూటిగా నేలపైన పడుతూ పిల్లవాణ్ణి రక్షిస్తున్నది.



ఈ అద్భుతాన్ని చూసిన దాదులు శుద్ధోదన మహారాజు వద్దకు వెళ్ళి, "మహారాజా, మీరు ఈ ఉత్సవం ఏం చూస్తారు? దీని కన్న వెయ్యిరెట్లు ఆశ్చర్యకరమైన వింత చూతురుగాని రండి!" అని చెప్పి, ఆయనను సిద్ధార్థుడుండే చోటికి తీసుకుపోయారు. శుద్ధోదన మహారాజు తన కొడుకు ఈశ్వరాంశ సంభూతుడేనని నిశ్చయించుకుని సిద్ధార్థుడి ముందు ప్రణమిల్లాడు.

ఆయన ఆ పసికందుతో, "నాయనా, ఈ మహత్తంతా నా ఎదట ఎందుకు ప్రదర్శిస్తున్నావు? ఈ సమయంలో నీ తల్లే బతికివుండి ఈ వింత చూస్తే ఎంత పరవశురాలయేదో!" అన్నాడు.

సిద్ధార్థుడు బాలచంద్రుడిలాగా దినదిన ప్రవర్ధమానుడవుతూ పెరిగి రాసాగాడు. ఇంత అల్లారు ముద్దుగా పెరిగే తన కుమారుడు సన్యసించుతాడని జ్ఞాపకం వచ్చినప్పుడల్లా శుద్ధోదన మహారాజుకు పట్టరాని బాధ కలిగేది.

సిద్ధార్థుడు పన్నెండేళ్ళవాడై ఉండగా శుద్ధోదనమహారాజు కొందరు దైవజ్ఞులను పిలిచి, "నా కుమారుడు ఏయే కారణాంతరాలవల్ల వైరాగ్యం పొందుతాడో చెప్పగలరా?" అని అడిగాడు.



"మహారాజా! వార్ధక్యమూ, వ్యాధి, మృతీ, సన్యాసీ—ఈ నాలుగూ చూసి నీ కుమారుడు జీవితంమీద విరక్తి చెందుతాడు," అని దైవజ్ఞులు చెప్పారు.

"నా కుమారుడు చక్రవర్తి కావలిసిందే గాని సన్యాసి కావటానికి ఎంతమాత్రమూ వీలులేదు," అన్నాడు శుద్ధోదనుడు. ముసలివాళ్లూ, రోగులూ, శవాలూ, సన్యాసులూ సిద్ధార్థుడి కంట పడకుండా ఉండగలందులకు ఆయన తగిన కట్టుదిట్టాలు చేశాడు.

సిద్ధార్థుడి కోసం మూడు రాజభవనాలు నిర్మించారు. వాటి పేర్లు రమ్యా, సురమ్యా, శుభ్ర; ఒకటి చలికాలానికీ, ఇంకొకటి ఎండాకాలానికీ, మూడవది వానాకాలానికీ ఉపయోగించేలాగా వాటిని నిర్మించారు. ఈ మూడు భవనాల చుట్టూ విశాలమైన ఆవరణలున్నాయి. వాటిలో అనేకమందిని పహరావాళ్ళను ఉంచారు; సిద్ధార్థుడి కంట పడగూడనివారిని ఆవరణలోకి రానివ్వకుండా చూడటం వారి పని.

సిద్ధార్థుడికి పదహారో ఏడు రాగానే శుద్ధోదనమహారాజు అతని వివాహంగురించి ఆలోచన చేశాడు. కపిలవస్తు రాజవంశంవారు వ్యాఘ్రపుర రాచకన్యలను చేసుకోవటం రివాజు. అందుచేత, వ్యాఘ్రపురరాజైన



సుప్రబుద్ధుడి కుమార్తెను, యశోధరను, తన కొడుకుకిచ్చి వివాహం చెయ్యమని శుద్ధోదనుడు కబురు చేశాడు.

సిద్ధార్థుడు సన్యాసి అయే యోగం ఉన్నదని సుప్రబుద్ధుడికి తెలుసును. అతను సన్యసించినట్టయితే తన కుమార్తె అనాథ అయిపోతుందని భావించి ఆయన శుద్ధోదనుడి కోరికను నిరాకరించాడు. కాని యశోధరమాత్రం సిద్ధార్థుణ్ణి తప్ప మరెవ్వరినీ పెళ్ళాడననీ, అతను సన్యాసి అయినా తనకు అభ్యంతరం లేదనీ అన్నది.

శుద్ధోదనుడు సుప్రబుద్ధుడి తిరస్కారాన్ని లక్ష్యపెట్టక, తానే స్వయంగా వ్యాఘ్రపురానికి

వెళ్ళి యశోధరను వెంటబెట్టుకుని కపిలవస్తు నగరానికి వచ్చాడు. తరవాత సిద్ధార్థుడికీ యశోధరకూ శాస్త్రోక్తంగా వివాహమూ, యౌవరాజ్య పట్టాభిషేకమూ జరిపారు. యశోధర సిద్ధార్థుడి పట్టమహిషి; అందుచేత అతనితోబాటు ఆమెకూడా సింహాసనంపై కూర్చుని కిరీటం ధరించింది. ఇదంతా పూర్తి అయినాక శుద్ధోదనమహారాజు శాక్యులందరికీ ఈ విధంగా కబురు పంపాడు: "నా కుమారుడైన యువరాజు సిద్ధార్థుడికి ఉపపత్నులుగానూ, పట్టమహిషి యశోధరకు చెలికత్తెలుగానూ ఉండటానికి అవివాహితులైన మీ మీ కుమార్తెలను పంపండి!"

అయితే రాజబంధువులు ఇందుకు ఒప్పుకోక, "యువరాజు పసివాడు, చాలా సుకుమారుడు. అతను ఇంతవరకూ ఒక్క క్షాత్రవిద్యకూడా అభ్యసించలేదు. యుద్ధం వస్తే ఇలాటివాడు శత్రువును ఎలా ఎదుర్కొంటాడు? మా కుమార్తెలను ఏవిధంగా పోషించగలుగుతాడు? ఒక్క విద్యా రాని వాడివద్దకు మా కుమార్తెలను పంపేది లేదు!" అన్నారు.

తననుగురించి తన కులంవారు ఇలా అన్నారని విని సిద్ధార్థుడు చాలా నొచ్చుకున్నాడు. "నా శక్తి సామర్థ్యాలు ప్రత్యక్షంగా చూడగోరేవారు సరిగా వారంరోజులకు





రాజభవనానికి రావలిసింది!" అని నగర మంతటా చాటింపు వేయించాడు.

అతను నిర్ణయించిన గడువురోజున రాజ భవనం ఆవరణలో బ్రహ్మాండమైన పందిరి వేశారు. ఆతని బంధుబలగం నూటఅరవై వేలమంది గాక ఇంకా అనేకమంది దాస దాసీజనం అతని అస్త్రనైపుణ్యం చూడటానికి హాజరయారు. అందరూ చూస్తూండగా సిద్ధార్థుడు ఒక బాణం తీసుకున్నాడు. దానికి మామూలు మనుషులెవరూ నారి సంధించ లేరు. అలాటి బాణాన్ని అతను తన కుడి కాలి బొటనవేలుపై నిలబెట్టి ఒక వేలి గోరుతో, కూర్చున్న చోటినుంచి లేవకుండానే, నారి సంధించి ధనుష్టంకారం చేశాడు. ఆ వింటితాడు చేసిన మోత ఉరుము చప్పుడు లాగా దశదిశలా ప్రతిధ్వనించింది.

తరవాత సిద్ధార్థుడు ఆ విల్లు ఎక్కుపెట్టి ఒకే బాణంతో నాలుగు అరటిచెట్లను ఛేదించాడు; కళ్ళకు గంతలు కట్టుకుని గురిగా కొట్టాడు; వెంట్రుకకు వేళ్ళాడే వస్తువులనుకూడా, బాణంతో వెంట్రుకను తెంచి పడగొట్టాడు. అతను అష్ట శిల్పాలలోనూ తనకు పాండిత్యమున్నట్టు అందరి ఎదటా నిరూపించుకున్నాడు.

సిద్ధార్థుడి సామర్థ్యం గురించి శాక్యులు సంతృప్తిపడి తమ కుమార్తెలను నలభై






వారు రాజభవనం దాటి కొద్దిదూరం వెళ్లారో లేదో, ఒక వింతమనిషి సిద్ధార్థుడి కంట పడ్డాడు. ఆ మనిషి వంగబడి, వణుకుతూ నడుస్తున్నాడు, ఆయన నెత్తిమీది జుట్టంతా నెరిసిపోయింది, నోట్లో చాలా భాగం దంతాలు లేవు.

ఆ మనిషిని చూసి సిద్ధార్థుడు ఆశ్చర్యపడి చెన్నుడితో, "అదేమిటి? ఆ మనిషి అలా ఉన్నాడేం?" అన్నాడు.

"ఆయన ముసలివాడు!" అని చెన్నుడు జవాబు చెప్పాడు.

"అందరిలాగా కాకుండా ఆయన ముసలిగా ఎందుకు పుట్టాడూ?" అని సిద్ధార్థుడడిగాడు. ముసలితనం ఏమిటో కూడా అతనెరగడు.

చెన్నుడు నవ్వి, "ఆయన ముసలివాడుగా పుట్టలేదు. ఒకప్పుడు మనలాగే పడుచువాడు. ముసలితనం రావటంచేత అలా అయాడు," అన్నాడు.

"ఇలాటివాళ్లు ప్రపంచంలో చాలామంది ఉన్నారా?" అని సిద్ధార్థుడు మళ్లీ అడిగాడు.

"లేకేం, మహారాజా? చాలామంది ఉన్నారు!" అన్నాడు చెన్నుడు.

సిద్ధార్థుడు కొంచెం ఆలోచించి, "నేను కూడా ముసలితనం వస్తే అలాగే వంగబడి

వేలమందిని సిద్ధార్థుడికి ఉపపత్నులుగానూ, యశోధరకు చెలికత్తెలుగానూ ఉండటానికి పంపారు.

సిద్ధార్థుడికిప్పుడు అన్ని సుఖాలూ అందుబాటులో ఉన్నాయి. అతని చుట్టూ ఒక భూలోకస్వర్గం ఏర్పాటయింది. అలాటి స్వర్గసుఖాలలో మునిగితేలుతూ సిద్ధార్థుడు ఒకనాడు తన సారథి అయిన చెన్నుడితో, "ఉద్యానవనానికి పోతాను, రథం సిద్ధం చెయ్యి," అన్నాడు.

చెన్నుడు రథానికి నాలుగు తెల్లని గుర్రాలను పూన్చి తెచ్చాడు. సిద్ధార్థుడు అందులో ఎక్కి ఉద్యానవనంకేసి బయలుదేరాడు.





పోయి, ఆ ముసలివాడిలా వణుకుతూ నడుస్తానా ?'' అని అడిగాడు.

"బతుకుతూపోతే ప్రతివాళ్లకూ ముసలితనం వచ్చితీరుతుంది!" అని చెన్నుడు బదులు చెప్పాడు.

"ఉద్యానవనానికి పోవద్దు. రథం వెనక్కు తిప్పు," అన్నాడు సిద్ధార్థుడు. ఈ జీవితంలో చివరకు మిగిలేది ముసలితనమేనా ? ఎందుకీ పాడు జీవితం ? అని పించింది సిద్ధార్థుడికి.

తన కుమారుడు అంత త్వరగా రాజ భవనానికి తిరిగి రావటం గమనించి శుద్ధోదనుడు కారణ మడిగి తెలుసుకున్నాడు. సిద్ధార్థుడు ఉద్యానవనానికి వెళ్లే దారిలో ఒక ముసలివాణ్ణి చూసి కలతపడి ఇంటికి తిరిగి వచ్చాడని తెలియగానే ఆయనకు కంగారు పుట్టుకొచ్చింది. ఆయన వెంటనే సిద్ధార్థుడి మనసును ఉల్లాసపరచటానికి నృత్య గాన వినోదాదులు ఏర్పాటు చేయించి, అతని భవనాల చుట్టూ ఉండే పహరావారిని రెట్టింపు చేశాడు.

నాలుగు మాసాలు గడిచాయి. మళ్లీ ఒకనాడు సిద్ధార్థుడు తన రథంలో ఉద్యాన వనానికి బయలుదేరాడు. ఈసారి దారిలో అతనికి ఒక రోగిష్ఠివాడు కనిపించాడు.



ఆ మనిషిని చూస్తేనే సిద్ధార్థుడికి శరీర మంతా కంపించింది.

"ఆ మనిషి అలా ఉన్నాడేం ?'' అని అతను చెన్నుణ్ణి అడిగి, అతను భయంకర మైన వ్యాధితో తీసుకుంటున్నాడనీ, ప్రాణులకు వ్యాధులు రావటం పరిపాటే ననీ తెలుసుకున్నాడు. ఇదా జీవితమంటే ? ఇలాటి జీవితంకోసం ఆశించటం దేనికి ? అనుకుని, సిద్ధార్థుడు రథాన్ని తిరిగి ఇంటికి మళ్లించాడు.

ఈసారి తన కుమారుడు త్వరగా ఇంటికి తిరిగిరావటానికి కారణం అతను రోగిని చూడటమేనని తెలియగానే శుద్ధోదనుడు

మరింత కంగారుపడ్డాడు. ఇలాటి దృశ్యాలు సిద్ధార్థుడి కంట పడకుండా చేయటానికి ఆయన సర్వ యత్నాలూ చేశాడు.

అయినా సిద్ధార్థుడు మరి నాలుగు మాసాల అనంతరం శవాన్ని చూడనే చూశాడు. అంతకు మునుపు అతనికి చావంటే ఏమిటో తెలియదు. పుట్టిన ప్రతి ప్రాణీ విధిగా చచ్చి తీరుతుందని చెన్నుడు అతనితో చెప్పాడు. ఈసారికూడా సిద్ధార్థుడు రథాన్ని వెనక్కు తిప్పించి ఇంటికి వచ్చేశాడు దైవజ్ఞులు చెప్పిన మాట నిజమవుతున్నది; శుద్ధోదనుడు దాన్ని ఏమాత్రం వారించలేకపోయాడు.

మరి నాలుగుమాసాలు గడిచాయి. ఆషాఢ పూర్ణిమ దినం వచ్చింది. యశోధర నిండు చూలాలు; ఏ క్షణాన అయినా కనేటట్టుగా ఉన్నది. సిద్ధార్థుడు మామూలు అలవాటు ప్రకారం చెన్నుణ్ణి రథం తెమ్మని, దానిలో ఎక్కి ఉద్యానానికి బయలుదేరాడు. మధ్య దారిలో అతనికి ఒక సన్యాసి కనిపించాడు. ఆ సన్యాసి తల గొరిగించుకుని, కాషాయ వస్త్రాలు ధరించి, తల వంచి తాను వెళ్ళే దారిన కొద్దిగజాలదూరం మాత్రమే చూస్తూ నడుస్తున్నాడు. ఆయన ముఖం చూస్తే ఆయన హృదయంలో ఏలాటి రాగ విద్వేషాలూ, వికారాలూ లేనట్టు సిద్ధార్థుడికి కనబడింది.

"చెన్నా, ఎవరీ మనిషి? అందరిలాగా లేడేం?" అని అతను తన సారథిని అడిగాడు.

"ఆ మనిషి సన్యాసి. ఆయన ఐహిక సుఖాలన్నిటినీ విసర్జించి జన్మపరంపర నుండి విముక్తి కాగోరేవాడు!" అని చెన్నుడు జవాబు చెప్పాడు.

సిద్ధార్థుడి మనసు ఒక్కసారిగా తేలిక అయినట్టు కనబడింది. అతను చెన్నుడితో, "రథాన్ని త్వరగా ఉద్యానవనానికి తోలు!" అన్నాడు. —(ఇంకా ఉంది)





# ధర్మం గెలిచింది

ఒక గ్రామంలో వినయుడనే రైతు ఉండేవాడు. ఆయన గొప్ప ధర్మాత్ముడు. తన జన్మలో ఎవరికీ ఏ విధమైన అపచారమూ చేసి ఎరగడు, ఎన్నడూ అసత్యం ఆడి ఎరగడు, అన్నిటికీ దైవాన్నే నమ్ముకునేవాడు.

వినయుడికి ఒక్కడే కొడుకు. వాడి పేరు పీతాంబరుడు. వాడికి పెళ్లి అయింది, ఒక కూతురూ కొడుకూ కలిగారు. పీతాంబరుడు తండ్రిపట్ల ఎంతో శ్రద్ధాభక్తులు కలవాడై, తండ్రిలాగే తానుకూడా ధర్మం తప్పకుండా జీవిస్తూవచ్చాడు.

పీతాంబరుడి కొడుకు రెండేళ్లవాడై ఉండగా ఆ ప్రాంతాల భయంకరమైన క్షామం ఏర్పడింది. ప్రజలు తిండిలేక దుర్బలులై ఉన్నస్థితిలో విషజ్వరాలు వచ్చి అంతులేని జనాన్ని చంపేశాయి. పీతాంబరుడి భార్యా, కూతురూ విషజ్వరాలతో మరణించారు.

పీతాంబరుడికికూడా జ్వరం తగిలింది గాని, వాడు ఎలాగో మృత్యువువాతపడకుండా తప్పించుకుని బయటపడ్డాడు.

వినయుడు వృద్ధుడు, పీతాంబరుడి కొడుకు పసికందు, పీతాంబరుడు జ్వరపడటంచేత చిక్కి శల్యమయిపోయాడు. వారికి గంజి తాగటానికైనా నూకలులేవు. ఎక్కడనైనా కూలిచేసి ఇన్నినూకలు తెచ్చుకుందామనే ఉద్దేశంతో పీతాంబరుడు పార చేత పట్టుకుని బయలుదేరాడు.

"ఇంత నీరసంగా ఉన్నావు, నువు కూలి ఏంచేస్తావు, నాయనా? నేనేవెళ్లి ఎక్కడైనా ఇన్నినూకలు ముష్టెత్తి తెస్తాను!" అని తండ్రి అన్నాడు. కాని పీతాంబరుడు వినిపించుకోలేదు.

అప్పుడే పొలాలపని ఆరంభమయింది. చెయ్యగలవారికి పని దొరుకుతున్నది. మిగిలిన కూలీలతోబాటు నిలబడిన పీతాం

ఎ. మధుసూదనరావు





నువ్వూ, నేనూ కలిసి బిచ్చానికి పోదాం!" అన్నాడు వినయుడు.

"లేదులే, నాన్నా. ఈ పూటకు గంజి తాగేద్దాం. రేపు బలమైన ఆహారం సంపాదిస్తాను!" అన్నాడు పీతాంబరుడు.

"పిచ్చివాడా, మనకీ గంజే కరువై ఉంటే ఇంకా బలమైన ఆహారం ఎక్కడినుంచి వస్తుందిరా!" అన్నాడు వినయుడు.

వినయుడి ఇంటికి సమీపంలోనే ఒక భూస్వామి పశువులుండే ఆవరణ ఉన్నది. ఆ ఆవరణలో రాత్రివేళ జొరబడి ఒక గొర్రెను దొంగిలించుకు రావాలని పీతాంబరుడు నిశ్చయించుకున్నాడు. తాను జ్వరంతో ఉన్నంతకాలమూ తన తండ్రి ముష్టి ఎత్తాడు. ఆ సంగతి పీతాంబరుణ్ణి బాధిస్తున్నది. తనకా బలం వస్తేనేగాని కూలి దొరకదు. తండ్రి గంజి తాగటం తాను సహించలేడు. అందుచేత పీతాంబరుడు ఈపనిచేయ నిశ్చయించాడు.

ఇంతకాలమూ ఆదర్శప్రాయంగా ప్రవర్తించిన తన కొడుకు ఇప్పుడు ఏదో కూడని పని తలపెట్టాడని వినయుడికి అనుమానం తగిలింది. దానితో ఆయన మనసు ఆందోళన పడసాగింది. ఆ రాత్రి ఆయనకు సరిగా నిద్రపట్టలేదు.

బరుణ్ణి చూసి జాలిపడినవారు చాలామంది ఉన్నారు, కాని పని ఇచ్చినవారు ఒక్కరూ లేరు. వాడి కళ్లలో ప్రాణాలున్నాయి, పార పట్టినచెయ్యి బలహీనతవల్ల వణుకుతున్నది, అలాటివాడికి పని దొరుకే అవకాశం ఎలావుంటుంది.

సాయంకాలందాకా పొలాల్లో తారట్లాడి పీతాంబరుడు గ్రామంలోకి తిరిగి వచ్చాడు. ఆ ఇంటా ఆ ఇంటా ఇన్నినూకలు ముష్టెత్తాడు. అవితీసుకుని బాగా పొద్దుపోయిం తరవాత ఇల్లు చేరుకున్నాడు.

"నే చెబితే విన్నావా, నాయనా? నీకు కూలి దొరకదు, దొరికినా చెయ్యలేవు. రేపు



ఒక రాత్రివేళ ఏదో అలికిడి అయి వినయుడు నిద్రలేచి చుట్టూ కలయచూశాడు. ఇంటివాకిలి తెరిచి ఉన్నది. పీతాంబరుడు పడుకున్న చోట లేడు. ఒక గంట గడిచింది. ఇంటివెలపల ఉన్న పశువులకొట్టంలో అలికిడి వినపడింది. వినయుడు చప్పుడు చెయ్యకుండా వెళ్లి పశువులకొట్టంలోకి తొంగిచూశాడు.

పీతాంబరుడు గొర్రె కళేబరాన్ని పెద్ద కత్తితో ముక్కలుగా నరుకుతుండటం ఆయనకు కనిపించింది.

వినయుడు నిస్పృహతో ఇంట్లోకి తిరిగి వచ్చి తన మామూలు చోటులో పడుకున్నాడు. ఇంత కాలానికి తన కొడుకు చెయ్యగూడని పని చేశాడు; దీనికి వాడు శిక్ష అనుభవిస్తాడు. ఇందుకుగాను వృద్ధుడు చాలా బాధపడ్డాడు. వాడీ పని తనకోసమే చేశాడు; తను పస్తులు పడుకోవటం వాడు చూడలేకుండా ఉన్నాడు. చేసిన పని తప్పని తన కొడుకును ఎలా మందలించాలో వినయుడికి తెలియలేదు.

పీతాంబరుడు గొర్రెమాంసాన్ని పశువుల కొట్టంలోని అటకమీదపెట్టి చేతులు కడిగేసుకుని, ఏమీ ఎరగనివాడిలాగా తన మామూలు చోటులో పడుకుని నిద్రపోయాడు.




వినయుడు తెల్లవారగానే లేచి పీతాంబరుణ్ణి లేపి, "నాయనా, బిచ్చమెత్తపోదాం పద. ఎంత పెందలాడి బయలుదేరితే అంత మంచిది," అన్నాడు.

"ఇవాళ బిచ్చమెత్త నవసరంలేదని రాత్రే చెప్పాను గదా, నాన్నా? బలమైన ఆహారం తెస్తానంటినిగా! మనం ఈ పూట మాంసం తిందాం," అన్నాడు పీతాంబరుడు.

"నిన్న రాత్రిలేని మాంసం ఇప్పుడెక్కడినుంచి వస్తుందిరా, నాయనా. నేను తిండికి మాడుతున్నానన్న విచారంతో ఏదైనా అక్రమం తలపెట్టావేమో! అలా పొట్టనించుకునేకన్న నాకు ఆకలిచావే ఇష్టం. తిండి



కోసం కూడనిపని ఏదీ చెయ్యనని ఇప్పుడే నామీద ఒట్టుపెట్టుకో!" అన్నాడు వినయుడు.

"ఈ క్షణంనుంచీ నువు చెప్పినట్టే చేస్తాను, నాన్నా. ఈ పూటకు బిచ్చంమాట ఎత్తకు. నేనిదివరకే మాంసం సంపాదించాను. అది అయిపోయినాక బిచ్చం ఎత్తుకుందాం. నాకు కాస్త బలంకూడా వస్తుంది, ఎవరైనా కూలికూడా ఇస్తారు. నా మాట విను, నాన్నా!" అన్నాడు పీతాంబరుడు.

వినయుడికి కోపం ఆగలేదు; "మాంసం సంపాదించావా? ఎప్పుడు సంపాదించావు? ఎవరిచ్చారు? ఎందుకిచ్చారు? రాత్రి నాతో పడుకుని మళ్లీ నాతో లేస్తివి గదా, ఈ లోపల మాంసం ఎక్కణ్ణుంచి వచ్చింది. పాపిష్టివాడా, నా కళ్లు కప్పుదామనుకున్నావా? నేను రాత్రి మన పశువుల పాకలోకి తొంగిచూశాను. నువు గొర్రెమాంసం కోయటం నాకుకనపడింది!" అని అరిచాడు.

పీతాంబరుడు కళ్లవెంట నీరుకారుస్తూ, "క్షమించు, నాన్నా. నువు మాడటం చూడలేకపోయాను. నీకంత అభ్యంతరమైతే ఆ మాంసం మనకు వద్దులే! గ్రామంలో ముష్టెత్తుకుందాం పద!" అన్నాడు వాడు పశ్చాత్తాపంతో.

కాని ఈలోపలనే జరగవలిసిన మోసం జరిగిపోయింది. లోపల తండ్రి కొడుకుల



మధ్య జరిగిన ఈ సంభాషణను ఇంటి బయట ఉన్న రక్షకభటులు విన్నారు.

జరిగిందేమిటంటే, ఆ రోజు తెల్లవారు జామునే భూస్వామి పశువులకాపర్లు గొర్రె ఒకటిపోయిన సంగతి తెలుసుకుని తమ యజమానితో చెప్పారు. భూస్వామి వెంటనే గ్రామాధికారికి కబురుచేసి, తన గొర్రెను ఒకదాన్ని ఎవరో ఎత్తుకుపోయారనీ, ఆ దొంగతనం ఆచోకీ తీయించవలిసిందనీ కోరాడు. భూస్వామి పశువులదొడ్డికి సమీపంలో ఉన్న ఇళ్లన్నీ సోదాచెయ్యటానికి గాను రక్షకభటులు బయలుదేరారు. వారిలో కొందరు వినయుడి ఇంటికికూడా వచ్చారు.

వినయుడు కొడుకుతో అన్న మాటలు చెవినిపడగానే రక్షకభటులు పశువుల పాక లోకివెళ్లి అక్కడ వెతకగా అటకమీద గొర్రె మాంసం అంతా దొరికింది. దొంగకూడా దొరికి పోయాడు. గొర్రె తాలూకు చర్మంమాత్రం ఎంత వెతికినా దొరకలేదు. అయినా పీతాంబరుడు దొంగ అన్న సంగతి అతని తండ్రి మాటలతోనే రుజువయింది గనక రక్షకభటులు అతని చేతులకు సంకెళ్లు తగిలించి తీసుకుపోయారు.

భూస్వామి కర్కోటకుడు. దొంగతనం బయటపడిన వివరాలు తన మనుషుల ద్వారా వినగానే ఆయన గ్రామాధికారివద్దకు





వెళ్లి, " అయ్యా, ఈ పీతాంబరుణ్ణి నగరంలో ఉండే న్యాయాధికారివద్దకు పంపి విచారణ జరిపించి, వాడికి పూర్తి శిక్షపడేలాగు చూడండి. ఈ దెబ్బతో ఇలాటి దరిద్రు లందరికీ బుద్ధి రావాలి! వీణ్ణి తేలికగా పోనివ్వటం నాకేమాత్రమూ ఇష్టంలేదు. వీడి దొంగతనానికి వేరే సాక్ష్యంకూడా అవసరం లేదు, వీడి తండ్రినే సాక్ష్యం వేసుకుందాం. ఆ నిర్భాగ్యుడు వినయుడు ధర్మస్వరూపు డుట! అదెంతవరకు నిజమో అదికూడా తేలిపోతుంది !" అన్నాడు.

గ్రామాధికారి భూస్వామి కోరిన ప్రకారం పీతాంబరుణ్ణీ, అతని తండ్రినీ, మాంసం దాచిన చోటు చూసినవారినీ, ఇతర సాక్షులనూ నగరంలో ఉండే న్యాయాధికారి వద్దకు పంపాడు.

నగరంలోని న్యాయాధికారి చాలా దయా స్వభావుడు. తిండికి ప్రజలు పడే కటకట ఆయనకు తెలుసు. కరువు వెంబడే విష జ్వరాలు వచ్చి ప్రజలను భయంకరంగా పీడించాయి. అటువంటి పరిస్థితులలో ఆయన తిండి దొంగతనాలను కఠినంగా శిక్షించలేక పోయాడు. కాని పీతాంబరుడి పైన వచ్చిన ఫిర్యాదును గురించి ఆయనకు కొంత బాధ కలిగింది. ఎందుచేతనంటే దొంగతనం గురించి ఉన్న సాక్ష్యంలో ఒక్క రవ్వయినా వెలితిలేదు. దానికి తగ్గట్టే ఫిర్యాదుచేసే పెద్దమనిషి దొంగపై తాను పాములాగా పగపట్టి పూర్తి శిక్ష కోరు తున్నాడు. తాను అనవసరమని చెప్పినప్ప టికీ న్యాయాస్థానంలో దొంగకు వ్యతిరేకంగా వాడి తండ్రిచేతనే సాక్ష్యం చెప్పించాలని పట్టుపడుతున్నాడు. ఉన్న పరిస్థితులలో చట్టాన్నిబట్టి శిక్ష విధించటం తన విధి. న్యాయాధికారి అయిన తాను పక్షపాతబుద్ధి చూపకూడదు.

పీతాంబరుడి విచారణ ప్రారంభ మయింది. భూస్వామి తన ఫిర్యాదు చెప్ప

కున్నాడు. అతని గొర్రెలకాపరులు గత రాత్రి గొర్రె దొంగిలించబడినట్టు సాక్ష్యం చెప్పారు. గ్రామాధికారి పంపిన మనుషులు తాము విన్న తండ్రి కొడుకుల సంభాషణ గురించీ, పాకలో వెతకగా అటక మీద తమకు గొర్రెమాంసం దొరకటం గురించీ సాక్ష్యం చెప్పారు.

"ఈ సాక్ష్యమంతా ఒక ఎత్తూ, వినయుడి సాక్ష్యం ఒక ఎత్తూనూ. ముసలివాణ్ణి సాక్ష్యం చెప్పమనండి!" అన్నాడు భూస్వామి మీసం మెలివేస్తూ.

"నీ కొడుకు చేసిన ఈ దొంగతనం గురించి నీకు తెలిసినదంతా ప్రమాణపూర్తిగా చెప్పు!" అన్నాడు న్యాయాధికారి వినయుడితో.

"స్వామీ, నా కొడుకును శిక్షించకండి. వాడు నాకొక్కడే కొడుకు. నిన్నటిదాకా వాడు ఒక్క అనరాని మాట అని ఎరగడు, చేయరాని పని చేసి ఎరగడు. క్షామంవచ్చి మమ్మల్ని భయంకరంగా పీడించింది. అది చాలక వాడి భార్యా, పెద్ద పిల్లా జ్వరాలతో పోయారు. వాడే చచ్చి బతికాడు. నేనూ, నా రెండేళ్ల మనవడూ తిండికి మాడుతుంటే చూడలేక పార తీసుకుని పనికి బయలు దేరాడు. కాని వాణ్ణి చూడండి, ఎముకల గూడు! వాడికి ఎవరు పని ఇస్తారు. నామీది



అపేక్షకొద్దీ ఈ పాడుపని చేశాడు. కాని, స్వామీ, వాడు ఇక ఎన్నడూ అటువంటి పని చెయ్యనని నాకు మాట ఇచ్చాడు. ఆ మాంసం ముట్టనని ప్రమాణం చేశాడు. మేం బిచ్చమెత్తబోతూండగా వాణ్ణి పట్టుకున్నారు. వాణ్ణి శిక్షించకండి. భగవంతుడు పెట్టిన కష్టాలు చాలు, మీరు నాకీ ముసలితనంలో ఇంకో కష్టం తెచ్చిపెట్టకండి. వాడీ భూస్వామి గొర్రెను దొంగిలించే ఉంటాడు. నేను కాదని ఎలా అనేది? ఆ గొర్రె మాంసాన్ని వాడు కొయ్యటం నేను కళ్లారా చూశాను. కాని ఇక ఎన్నడూ అలా చెయ్యడు. ఈ తప్పు కాయండి, బాబూ!" అని వినయుడు కన్నీరు కార్చాడు.

భూస్వామి మందహాసంచేస్తూ న్యాయాధికారికేసి చూశాడు.

న్యాయస్థానంలో వున్నవాళ్లంతా ముసలివాణ్ణి చూసి జాలిపడి, భూస్వామిని చూసి అసహ్యించుకున్నారు.

న్యాయాధికారి ఒక్క క్షణం ఆలోచించి భూస్వామికేసి తిరిగి, "మీ ఫిర్యాదుకు అవసరమైన సాక్ష్యం కనబడదే!" అన్నాడు.

భూస్వామి తెల్లబోయి, "ఈ సాక్ష్యమంతా విన్నారు గదా?" అన్నాడు.

"వినయుడి ఇంట దొరికిన మాంసం మీ గొర్రె దనటానికి సాక్ష్యం ఏదీ? మీ గొర్రె చర్మంమీద మీదని గుర్తుంటుంది గదా? ఆ చర్మం ఏదీ?" అన్నాడు న్యాయాధికారి.

"ఎంత వెతికినా ఆ చర్మం దొరకలేదు," అన్నాడు భూస్వామి.

"ఆ చర్మం దొరికేదాకా పీతాంబరుడు దోషి అని నేను నమ్మలేను. అతని ఇంట దొరికిన మాంసం ఫలానివారి గొర్రెదని రుజువుకాలేదు గనక దాన్ని పీతాంబరుడు యథేచ్ఛగా వినియోగించవచ్చు!" అని న్యాయాధికారి తీర్పు చెప్పాడు.

ఈ తీర్పువల్ల న్యాయం గెలవకపోయినా ధర్మం గెలిచింది!





# ప్రకృతి వింతలు

## 8

"విూకొక చిత్రం చూపిస్తాను, రండి," అంటూ కుమేవావా నన్ను అరణ్యంలోకి తీసుకువెళ్ళాడు. చెట్లమీద ఇంకా నీరెండ పడుతున్నది. అక్కడ మాకొక దారి కనిపించింది. నీరు తాగటానికి అరణ్యమృగాలు వచ్చేదారి అది.

ఆ దారిన కనిపించే కాళ్ళగుర్తులు ఏయే మృగాలవో వాడు వివరించి చెప్పాడు.

నది ఒడ్డున ఉన్న ఒక ఎత్తయిన చెట్టు పైకి ఎక్కి మేము నాటకంచూసే ప్రేక్షకుల లాగా కూచున్నాం. ఇంతలో పిల్లల ఏడుపు లాటి ధ్వని వినిపించింది. "అదేమిటి?" అన్నాను. "కోతులు," అంటూ వాడు నన్ను మాట్లాడవద్దని హెచ్చరించాడు. మా సమీపానవున్న ఒక చెట్టుకొమ్మ గలగలలాడింది. దాని పైనుంచి ఒక కోతుల కుటుంబం దిగి రావటం చూశాను. వాటిలో ఒక పెద్ద మగ కోతీ, ఒక చిన్న ఆడకోతీ వున్నాయి. ఆడ కోతి వీపున ఒక బుల్లి కోతిపిల్ల వున్నది. కోతులన్నీ నదివద్దకు వెళ్ళి నీరుతాగి, స్నానాలుచేశాయి. పసిపిల్లకోతికి మనిషి పిల్లలకు జరిగే ఉపచారాలన్నీ జరిగాయి.

తరవాత ఆ దారివెంబడి ఒక వింత జంతువు రావటం చూశాం. అది పెద్దకుక్క అంతవున్నది. దాని జల్లితోక ఆ జంతువు నడిచేటప్పుడు విసనకర్రలాగా ఈ పక్కకూ ఆ పక్కకూ ఊగుతున్నది. అది చీమలను తినే జంతువు. దాని మూతి సన్నగా, కోసగా 20 అంగుళాల నిడివి వున్నది. దాని నాలుక సన్నగా, చాలా పొడవుగా వున్నది. అది నాలుకను బయటికి చాచి, దారిలో కనిపించే చీమలను దానితో పోగుచేసి నోట్లోకి తీసుకుంటుంది. దాని కాలిగోళ్ళు పెంపు తిరిగి, నడవటానికి అంతరాయంగా ఉన్నాయి.

టిబోర్ సెకెల్జ్



కుమేవావా నాచెయ్యి నొక్కాడు. నేను కిందికి చూసేసరికి ఒక జాగ్వార్ పులి రావటం కనిపించింది. నా గుండె గుబగుబ లాడింది. ఏమంటే ఆ అరణ్యానికి అదే రాజు. దాన్నిచూసి మిగిలిన జంతువులు ప్రాణభయంతో పారిపోతా యనుకున్నాను. కాని అలాటిదేమీ జరగలేదు. జాగ్వార్ నీరు తాగేటప్పుడు కోతులు వాటిమానాన స్నానాలు చేస్తూనేవున్నాయి. నీరుతాగే 'చీమ లనుతినే జంతువు' తన మూతిని నీటినుంచి పైకికూడా తీయలేదు. జాగ్వార్ నది ఒడ్డున అగి, మూతిని నీటిమట్టానికి వుంచి పిల్లి లాగా కతుకుతూ నీరుతాగింది.

"జాగ్వార్ నుచూసి ఈ జంతువులు భయపడకపోవటానికి కారణ మేమిటి?" అన్నట్టు కుమేవావా కేసి చూశాను.

"నీరుతాగేవేళ, ఉదయమూ సాయం కాలమూ జంతువులమధ్య శాంతి," అని వాడు రహస్యంగా అన్నాడు.

నీరుతాగే రేవుల అరణ్యమృగాలమధ్య శత్రుత్వం వుండదని నాకు అర్థమయింది. అరణ్యజీవితం ఎరగనివాళ్ల కిది చాలా వింత గానే వుంటుంది. జాగ్వార్ నీరుతాగి, ఒళ్ళు విరుచుకుని, పెద్దగా ఆవలించి, తన శరీర మంతా ఒకసారి నాక్కుని, అరణ్యంలోకి వెళ్ళిపోయింది.

తరవాత కాస్సేపటికి టాపిర్ అనే జంతువు వచ్చింది. ఇది పందిలాగే వున్నది గాని, పందికంటె చాలా పెద్దది. ఇది మోటుచర్మంగల జంతువు. ఎమెజాన్ నదీప్రాంతంలో మోటుచర్మంగల జంతువు ఇది ఒక్కటే. దాని ముక్కు కిందికి వేళ్ళా డుతూ వుంటుంది. దీని వెనకగా ఒక చిన్న టాపిర్‌కూడా వచ్చింది. రెండూ కలిసి నీటిలోదిగి స్నానం చెయ్యసాగాయి.

అవి తిరిగి వెళ్లేటప్పుడు కుమేవావా ఒక బలమైన బాణం తీసుకుని ఎక్కుపెట్టి మగ టాపిర్‌ను గురిగా మెడమీద కొట్టాడు. అది

అక్కడే పడిపోయింది. మెడమీద కాక బాణం ఇంకెక్కడ తగిలినా టాపిర్ ఆ బాణంతోసహా అరణ్యంలోకి పారిపోయేదే.

మేము చెట్టుదిగి టాపిర్‌ను తీసుకుపోవటానికి యత్నించాము. కాని అది కనీసం అయిదువందల పౌనుల బరువుండటంచేత దాన్ని ఎత్తలేకపోయాము. మేము మా శిబిరానికి తిరిగివెళ్లి పదిమందిని తెచ్చాం. నలుగురు దివిటీలు పట్టుకున్నారు. మిగిలిన వాళ్ళు టాపిర్‌ను పట్టి ఈడ్చుకుపోయారు. మర్నాటికంతకూ సరిపోయే ఆహారం దొరికినందుకు ప్రయాణీకులంతా హర్షించారు.

మాంసం కోసి ఒక చెట్టుమీద వేళ్ళాడగట్టాము. దాన్ని అప్పుడే వండాలా, మర్నాటిదాకా వుంచాలా అన్న సమస్య వచ్చి కుర్రవాణ్ణి అడిగితే, "పచ్చిమాంసం జంతువుల కిష్టం, వండిన మాంసం మనుషుల కిష్టం అని మలోవా తాత అంటాడు," అన్నాడు.

వాడి మాటలు మాకు అప్పుడర్థంకాలేదు కాని ఆ రాత్రి పచ్చిమాంసం వాసన పసికట్టి డజను జాగ్వార్లు మా శిబిరంకేసి వచ్చేసరికి మాకు అంతా అర్థమయింది. వాటిని దూరంగా వుంచటానికి మా శిబిరంచుట్టూ నాలుగు పెద్ద మంటలు వేసి తెల్లవార్లూ వుంచవలిసి వచ్చింది.



తెల్లవారుజామున మంటవద్ద చలి కాచుకునేటప్పుడు కుమేవావా, "న్యికుచాప్, ఇవాళ మనం కలిసితిరిగే ఆఖరురోజు. సాయంకాలం మీరు వెళ్ళిపోతున్నారు," అన్నాడు. వాడు పైకి నవ్వాడేగాని లోపల విచారంగా వున్నదని గ్రహించాను.

"ఈ కుర్రవాడి ధర్మాన మనకు కనీసం రెండురోజులకు సరిపడే ఆహారం దొరికింది. వాడికోసం కొంత చందాలు వేసుకుందాం," అన్నాడొక పెద్దమనిషి. అందరూ తలా కాస్త చందా వేశారు. చందాలు వసూలయేలోపుగా కుర్రవాడు, "పళ్ళుకూడా కొన్ని వెంట తీసుకుపోవటం మంచిదిగదా!" అన్నాడు.

అనాసపళ్ళ కోసం ఇద్దరమూ బయలు దేరి కిందటిరోజు మేము అరణ్యంలో చేసిన మార్గంవెంట నడిచాం.

"ఇక్కడ అనాసపళ్ళుంటాయని నీకెలా తెలుసు?" అన్నాను.

"నిన్న మనం కొట్టిన టాపిర్ పంది ముక్కులో అనాస ముళ్ళున్నాయి. దానికి చర్మం మందం గనక ముళ్ళు గుచ్చుకున్నా తెలియదు. మనం కొట్టకముందు రెండు గంటలక్రితం అది అనాసపళ్లు తినివుండాలి; దాని పొట్టలో అనాస ఆకులున్నాయి."

వాడు చప్పున మాట చాలించి నా చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు. వాడు చూసే దిక్కుగా చూసేసరికి నాకు రెండు అందమైన జింకలు కనిపించాయి.

"జింకమాంసం బాగుంటుందా?" అని అడిగితే వాడు అమిత రుచిగా వుంటుం దన్నాడు. ఈమాట అంటూనే వాడు ఒక చిత్రమైన అరుపు అరిచాడు. ఆ అరుపు విని జింకలు రెండూ మెడలెత్తి మాకేసి చూశాయి. కుమేవావా తన విల్లూ బాణాలూ వదిలేసి వాటికేసి వెళ్ళాడు. అవి బెదరలేదు, కదలలేదు. వాడు ఒక జింకను సమీపించి దాని మెడమీద చెయ్యివేసి నిమిరాడు. తరవాత దాని ముఖంమీద ముఖంపెట్టి ఆనందిస్తూ నన్ను దగ్గిరికి రమ్మన్నాడు. నేను సమీపంగా వెళ్ళి రెండో జింకను నిమిరాను. ఉన్నట్టుండి ఆ జింక ఎందుకో బెదిరి పారిపోయింది, దానివెంట రెండోది కూడా పారిపోయింది.

"నాకు జంతువులను దువ్వటం ఇష్టం. చేతిలో విల్లు లేకపోతే అవి స్నేహంగా వుంటాయి. మీ మిత్రులకు తిండి పుష్కలంగావుంది. వేటాడ నవసరంలేదు. జంతువులుకూడా ఆకలి అయినప్పుడే ఇంకో జంతువును చంపుతాయి. మనిషి జంతువు కన్న తక్కువగా వుండరాదు," అన్నాడు వాడు. —(ముగింపు వచ్చే సంచికలో)



# తమాషాలు

అబ్బిగాడు మొదటిరోజు బడి నుంచి తిరిగివచ్చాడు. వాడి మొహాన సంతోషం లేకపోవటం చూసి అమ్మ, "బడి ఎలా ఉందిరా?" అని అడిగింది.

"నేనా బడికి పోను. నాకు రాయటమూ చదవటమూ చాతకాదాయె, మాట్లాడదామంటే మాట్లాడనివ్వరాయె! ఎందుకా బడి?" అన్నాడు అబ్బిగాడు.

*   *   *

"పంట పండేది వానాకాలంలోనటగా?" అన్నది ఒక బుల్లెమ్మ పంతులమ్మతో.

"ఎవరన్నారూ?" అని పంతులమ్మ అడిగింది.

"మా నాన్న."

"మీ నాన్నా? ఆయనకేం పనీ?"

"గొడుగులు మరమ్మతు చేస్తాడు."

*   *   *

గడ్డం గొరిగించుకునే ఆసామీ మంగలితో: అబ్బీ, నీ దగ్గిర ఇంకో కత్తి ఉన్నదా?

మంగలి: ఉన్నది; దేనికండీ?

ఆసామీ: ఆత్మరక్షణ చేసుకునేందుకు!

*   *   *

"నాకు వ్యాకరణం వచ్చేసింది, బావా!"

"వచ్చేసిందీ? అయితే చక్కెరకు బహువచనమేమిటి?"

"కలకండ."

*   *   *

"మా దగ్గిర ప్రస్తుతం ఉద్యోగాలులేవు. ఉన్నవాళ్లకే ఏమీ పనిలేదు."

"అయితే నన్ను తప్పక వేసుకోండి, సార్. నాకు ఏ పనీ చేతకాదు!"

*   *   *

అవసరమైతే మా పత్రికను ఒంటరిగా నడపగలవా?"

"నావల్ల కాదండి."

"అనుభవం ఉన్నవాడిలాగే కనిపిస్తున్నావు. నీకు ఉద్యోగం ఇచ్చిచూస్తాను."

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1959 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు, ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫెబ్రవరి నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:-చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అయితేగియితే అమ్మాయి ఎవరు?

రెండవ ఫోటో : ఆడేపాడే అందాలబాల.

పంపినవారు : పి. జయశ్రీ,

C/o. శ్రీ పి. లక్ష్మణమూర్తిగారు, అయితానగర్, తెనాలి.

బహుమతిమొత్తం రు. 10/- ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒక రోజున దాసూ, వాసూలు తోటకు వెళుతూండగా పెద్ద వానాగాలీ వచ్చింది. ఇద్దరూ వెంటతెచ్చుకున్న గొడుగు తెరిచారు. పక్కనే 'టైగర్' నడవసాగింది. కొంతదూరం అలా వెళ్లేసరికి ఒక గొర్రెపొటేలు వాళ్లను చూసి డీ కొట్టేందుకు తయారైంది. ఈలోపల గాలితాకిడికి దాసూ, వాసూల చేతిలోని గొడుగు చువ్వలు వెనక్కు వంగిపోయి, అది కాస్తా వాళ్ల చేతిలోనుంచి జారి పొటేలు తలమీద బోర్లాపడింది. పొటేలు దారికానక అటూ యిటూ గెంతేంతలో, దాసూ వాసూలూ, 'టైగర్' అక్కణ్ణించి పారిపోయారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press Private Ltd., and Published by B. VENUGOPAL REDDI for Sarada Binding Works, 2 & 3 Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

Photo by Madangopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఆడేపాడే అందాల బాల.

పంపినవారు :
పి. జయశ్రీ - తెనాలి

